


# వైదిక జన్మదిన వేడుక

(విశేష ఆయుష్కామ యజ్ఞవిధి సహితం)



మంత్రకర్త :

**"ఓ౩మ్" నామక సర్వాంతర్యామి**

సంకలనం - సరళార్థం :

**సుమ్మార్థి**

(డా. కోడూరి సుబ్బారావు)

**గాయత్రీ ఆశ్రమ ట్రస్టు ప్రచురణ**



# నిజమైన మాతాపిత పరమేశ్వరుడే

(ప్రార్థన)

**ఓం త్వం హి నః పితా వసో త్వం మాతా, శతక్రతో బభూవిథ ।**
**అథా తే సుమ్నమీమహే ॥**

- ఋగ్వేదం (8-98-11), సామ 1170, అథర్వ (20-108-2)

హే వసో! సర్వప్రాణులను వసింపజేయు పరమేశ్వరా! ఓ శతక్రతో! మమ్మ సుఖపెట్టుటకు అనేకానేక భోగ్యపదార్థాలను సృజించువాడా! మనో వాక్కాయాలతో మేము చేసిన కర్మలకు అత్యంత న్యాయంగా ఫలాల నిచ్చువాడా! నీవే మాకు నిజమైన తండ్రివి. తల్లివి కూడా నీవే. తండ్రిగర్భంలో వీర్యాన్ని, తల్లిగర్భంలో అండాన్ని, తదుపరి పిండాన్ని నిర్మించువాడవును నీవే కదా! నీవు మాకు ఎన్ని విషయభోగాలనిచ్చినా అవి క్షణికములే. అందుచే, ఓ సర్వాంతర్యామీ! మాకు నీ సుమ్నమ్‌ను-అఖండానందమును-మోక్షానందమును ప్రసాదింపుమని వినమ్రతతో వేడుకొనుచున్నాము.

Thou art our Almighty Father. Thou art our Mother Divine. To thee alone we pray for peace and your supreme Bliss. We are children always Thine.




# వైదిక జన్మదిన వేడుక

(విశేష ఆయుష్కామ యజ్ఞవిధి సహితం)




మంత్రకర్త :

**"ఓ౩మ్" నామక సర్వాంతర్యామి**

సంకలనం - సరళార్థం :

**సుమ్నార్థి**

(డా. కోడూరి సుబ్బారావు)

**గాయత్రి ఆశ్రమ ట్రస్టు ప్రచురణ**

వైదిక గ్రంథమాల : 63.

# వైదిక జన్మదిన వేడుక

(విశేష ఆయుష్కామ యజ్ఞవిధి సహితం)

సృష్టి సంవత్సరము : 197, 29, 49, 117.
విక్రమాబ్దము : 2072.
దయానందాబ్దము : 192.

శ్రీ దుర్ముఖి నామ సంవత్సరం, శ్రావణ పౌర్ణమి.
తేది : 18-08-2016.

మూల్యము : **30.00**

ప్రతులకు :

**డా॥ కోడూరి సుబ్బారావు**
వైదిక వానప్రస్థాశ్రమం, హనుమావురం, భువనగిరి - 508117.
సెల్ : 9908994084, 9290604641.

**గాయత్రీ ఆశ్రమ ట్రస్టు**
ఆర్యసమాజము, మేడిబావి,
12-10-586/6, ఇందిరానగర్ రోడ్ నం. 2,
వారాసిగూడ, సికింద్రాబాద్ - 500061. సెల్ : 9848011073.

**పం. మురళీ బ్రహ్మచారి**
జూలమ్మ గుడి ఎదురుగా, రెజిమెంటల్ బాజార్,
సికింద్రాబాదు. ఫోన్ : 9441033702.

**ఆరోగ్య రహస్య ప్రై.లి.**
6-1-297/1, సాయిబాబా గుడి దగ్గర,
పద్మారావు నగర్, సికింద్రాబాద్ 500 025.
ఫోను :- 040-27500015, 9849015638.

**డి.టి.పి. & ప్రింటింగ్ :**
**విక్రాంత్ ప్రింట్ హౌస్,**
వారాసిగూడ, సికింద్రాబాద్ - 500 061.
ఫోన్ : 9705085608.

## ద్రవ్యదాతకు ధన్యవాదములు



ఈ పుస్తక ముద్రణ వ్యయాన్ని దానంగా యిచ్చిన శ్రీ రావికంటి రాందేవ్‌గారు పుణ్య జీవులు. వీరు నిష్ఠాపరులైన ఆర్యపరివారంలో - శ్రీమాన్ రావికంటి కృష్ణమూర్తి, శ్రీమతి సుశీలమ్మ దంపతుల ప్రథమ పుత్రుడుగా శ్రీరామనవమి పర్వదినాన జన్మించారు. అందుచే తల్లిదండ్రులు వీరికి 'రాందేవ్' అని నామకరణం చేశారు. ఆర్యసమాజం సీతాఫలమండి వారిచే నడుపబడుచున్న వైదిక విద్యాలయంలో చదువుకోవటంవల్లా, తరచుగా సమాజ సత్సంగాలలో పాల్గొనటంవల్లా బాల్యంలోనే వైదిక ధర్మంపై శ్రద్ధా భక్తులేర్పడ్డాయి. దీనికి తోడు మా గురుదేవులు పం. గోపదేవ్ శాస్త్రి గారు తరచుగా ప్రచారం చెయ్యటానికి సీతాఫల్‌మండికి వస్తూ ఉండటం వల్లను, వీరియింటిలోనే వసతి భోజనం ఏర్పాటు చెయ్యటం వల్లను వీరికి వారి సాంగత్యం కూడా లభించింది. దానితో వీరిలో వైదిక జ్ఞానం బలపడింది. మరొక అదృష్టం-వీరికి ఆర్యపరివారంలోనే జన్మించిన శ్రీమతి సత్యశ్రీ గారు భార్యగా లభించటం.

తండ్రి నుండి వ్యాపారదక్షత, సమాజసేవానిష్ఠా రాగా, తల్లి నుండి సదాచారం ప్రేమ కరుణ వచ్చాయి. దానితో వీరు "శతహస్త సమాహర, సహస్రహస్త సంకిర" - (అథర్వవేదం 3.24.5) అనే వేద సందేశాన్ని వంట బట్టించుకొని ఆర్థకపుష్టిని పొంది తన కష్టార్జితాన్ని వైదిక పద్ధతిలో నడిచే గురుకులాలకు, గోశాలలకు, అనాథాలయాలకు, అన్నసత్రాలకు, యజ్ఞయాగాదులకు, ఆపత్కాల సేవలకు శక్తికొలది దానం చేస్తూ ఉంటారు. ఆ క్రమంలోనే మా గాయత్రీ ఆశ్రమ ట్రస్టునకు ఈ పుస్తక ముద్రణ వ్యయాన్ని దానంగా యిచ్చారు. వీరికి మా ధన్యవాదములు.

ఈ ఆర్యదంపతులకు 'ఆదిత్యకుమార్' అనే పేరుగల ఒక అబ్బాయి, 'ప్రణతి' పేరు గల ఒక అమ్మాయి సంతానంగా కలిగారు. ఇద్దరిని M.S. వరకు చదివించి సాఫ్ట్‌వేర్ ఇంజనీయర్లుగా తయారు చేశారు. అమ్మాయికి శ్రీమనోజ్ M.S. గారితో వివాహం జరిపించారు. ప్రస్తుతం ఈ ముగ్గురూ అమెరికాలోనే ఉద్యోగాలు చేస్తున్నారు. అబ్బాయికి పెండ్లి చెయ్యవలసి ఉంది.

సర్వవ్యాపక సర్వేశ్వరుడు శ్రీ రాందేవ్‌గారి పరివారానికంతకూ దీర్ఘ ఆయురారోగ్య ఐశ్వర్యాదులనిచ్చి సదా కాపాడు చుండును గాక!

శుభమస్తు,

- గాయత్రీ ఆశ్రమ ట్రస్టు సభ్యులు.



## నా అభిప్రాయాలు (Foreword).

"పుట్టిన రోజూ పండుగే అందరికీ, మరి పుట్టింది ఎందుకో తెలిసేది ఎందరికీ..." అనే సినీగీతం విన్నప్పుడల్లా పుట్టింది ఎందుకో తెలుపుతూ ఒక చిన్న పుస్తకం వ్రాస్తే బాగుంటుందని అనుకునే వాడిని. ఆ సినీగీతంలో గేయకర్త చక్కటి ప్రబోధమే చేశారు. దాని ననుసరించి జీవితాన్ని గడిపితే తప్పక అభ్యున్నతి కలుగుతుంది. అంటే-ఈ లోకంలో మంచి పేరు ప్రతిష్ఠలు కలుగుతాయి. రాబోయే జన్మ ఇంతకన్న మేలైన జన్మ వస్తుంది. భారతీయ ఋషుల అభిప్రాయమేమంటే ఆ అభ్యున్నతి మనను నిఃశ్రేయసంవైపు నడిపించేది కావాలంటారు. అది శాశ్వత సుఖసంతోషాల నిస్తుందంటారు. నిఃశ్రేయసమంటే ఉత్తమ శ్రేయస్సు. సర్వదుఃఖ నివృత్తి. జన్మరాహిత్యం-ముక్తి. దీనినే కణాద మహర్షి తమ "వైశేషిక దర్శనం" ప్రారంభంలోనే- **"యతః అభ్యుదయ నిఃశ్రేయస సిద్ధిః స ధర్మః"** వై.ద. (1-1-1) ఏది అభ్యుదయంతోబాటు నిఃశ్రేయసంవైపు నడిపిస్తుందో అదే ధర్మమని సూత్రీకరించారు. కనుక నేను ఆ ధర్మమార్గాన్ని కూడా తెలుపుతూ ఈ పుస్తకం వ్రాశాను.

పలువురు వేదవిద్వాంసులు జన్మదిన పద్ధతిని వారి సంస్కారవిధి గ్రంథాలలో ఒక ఉపసంస్కారంగా వ్రాశారు. వాటిలో పం. మదన మోహన విద్యాసాగర్ గారి "సంస్కార సముచ్చయం"లో కొంత విశాలంగాను, వివరణాత్మకంగాను ఉంది. ఎక్కువగా వారి విధిని అనుసరిస్తూ, నా స్వాధ్యాయంలో గ్రహించిన ప్రేరణాత్మకమైన కొన్ని వేదమంత్రాలను చేర్చి ఈ పుస్తకం వ్రాశాను.

ఇంతేగాక, ప్రస్తుతం నేను నివసిస్తున్న వైదిక వానప్రస్థాశ్రమం (భువనగిరి)లో తరుచు భక్తులు జన్మదినాలు జరుపుకుంటూ ఉంటారు. కొందరు వేడుకగా ప్రీతికర విందులతోనూ జరుపుకుంటున్నారు. ఆ యా సమయాలలో నేను కొద్దిసేపు ఉపదేశం చేస్తూ ఉంటాను. ఆ విధి విధానాలను, ఉపదేశాలను ఒక పుస్తకంగా వ్రాసి ప్రచురిస్తే బాగుటుందని సంకల్పం కలిగింది. ఈ సంకల్పం 5 సంవత్సరాల క్రితమే కలిగింది.

కాని, ఆరోగ్యం అనుకూలించకకొంత, పరిస్థితులు అనుకూలించక కొంత ఆలస్యమయ్యింది. ప్రతినెలా మా సీతాఫల్‌మండి ఆర్యసమాజం వారు ముద్రించి వితరణచేసే కరపత్రాలను, అప్పుడప్పుడు వితరణచేసే పుస్తకాలను వ్రాసే పనిలో ఉండటంవల్ల కూడా చాలా ఆలస్యమయ్యింది.

శ్రోతల శ్రద్ధాసక్తులను, స్థాయిని చూస్తూ ప్రవచనాలు చెప్పటం చాలా తేలికైన పని. కాని, అవే విషయాలను, విధివిధానాలను పుస్తకంగా వ్రాయటం చాలా బరువైన పని. సామాన్యప్రజలకు అర్థమయ్యే విధంగాను, జ్ఞానాన్ని, ప్రేరణను కలిగించేదిగాను, వైదిక సిద్ధాంతాలను నచ్చచెప్పేదిగాను ఉండాలి. తక్కువ పదములతో ఎక్కువ భావాన్ని తెలుపవలసి ఉంటుంది. నా శక్తి కొలది ప్రయత్నించాను. పాఠకులు దీనిని చదివి మీ అభిప్రాయాలను, సూచనలను తెలిపితే మలి ముద్రణలో చేర్చే ప్రయత్నం చేస్తాను. వేద విద్వాంసులు ఇందేవైనా లోపాలుంటే తెలిపితే వినమ్రతతో స్వీకరించి, పునరాలోచన చేసి సవరించుకుంటాను.

ఈ పుస్తకంలోని మొదటి భాగం 'జన్మదిన వేడుక' గత శ్రీ మన్మథ నామ సంవత్సరంలో మా సీతాఫల్‌మండి ఆర్యసమాజంవారు వెయ్యి ప్రతులు ముద్రించి వితరణ చేశారు. ఆ ప్రతులన్నీ అయిపోయినవి అట్టి తరుణంలో శ్రీ రావికంటి రాందేవ్ గారు ముందుకువచ్చి మల్టీకలర్ అట్టవేసి నేను ముద్రించి మీ గాయత్రీ ఆశ్రమ ట్రస్టునకు ఇస్తామన్నారు. దీనిలో చాలా వృద్ధులైనవారికి, దీర్ఘరోగాలతో మంచానికే పరిమితమైపోయిన వారికి కూడా ఉపయోగపడే "విశేష ఆయుష్కామ యజ్ఞవిధి" ని అనుబంధంగా చేరిస్తే బాగుంటుందన్నారు. అందుచే ఆ ప్రయత్నం కూడా చేశాను. దాతలైన శ్రీ రాందేవ్ గారికి, ప్రూఫ్‌లు దిద్దుటలో సహకరించిన శ్రీ డి. గంగాధర్, శ్రీ డి. నర్సయ్య గార్లకు, అందంగా ముద్రించి యిచ్చిన విక్రాంత్ ప్రింట్ హౌస్ వారికి నా ధన్యవాదములు.

**సుమార్థి**

(డా. కోదూరి సుబ్బారావు)



# మానవ జన్మ ఎందుకు?

## సృష్టికర్త సమాధానం....

ఓం జాతో జాయతే సుదినత్వే అహ్నాం,
సమర్యే విదథే వర్ధమానః ।
పునన్తి ధీరా అపసో మనీషా,
దేవయా విప్ర ఉదయర్తి వాచమ్ ॥

- అథర్వవేదం (3-8-5)

పురుషార్థంతో దినములను సుదినములు చేసుకోనుటకే మీకు మానవజన్మను ప్రసాదించాను. బుద్ధి మంతులు జీవన సంగ్రామం చేస్తూ వర్ధిల్లుదురు. ధీరులు-ధీమంతులు తమ బుద్ధితో కర్మలను పవిత్రం చేసుకొందురు. విప్రులు-జ్ఞానులు దివ్యకామనతో లోకహితం కోరుతూ ఉపదేశింతురు.

కనుక, మీరంతా వివేకవంతులై సదా సత్కర్మల నాచరిస్తూ వర్ధిల్లండి.

"శతం జీవ శరదో వర్ధమానః"



# వైదిక పద్ధతిలో జన్మదిన వేడుక

నేడు లోకంలో జన్మదినాలను వేడుకలుగా, పండుగలుగా జరుపుకునే వారి సంఖ్య క్రమంగా పెరుగుతున్నది. ఇది మంచిదే. గడిచిన గతాన్ని ఒకసారి నెమరు వేసుకొని మన భౌతిక ఉన్నతి ఎంత? ఆత్మికోన్నతి ఎంత? అని ఆత్మ నిరీక్షణ చేసుకోవటం అవసరమే. జరిగిన పొరపాట్లు ఎన్ని? తప్పిదాలు ఎన్ని? చేసుకున్న పుణ్యం ఎంత? పాపం ఎంత? అని ప్రశ్నించుకొని సరిదిద్దుకోవటం అంతకన్న ఎక్కువ అవసరం. మనం ఈ శరీరాన్ని వదిలిపెట్టి వెళ్లేటప్పుడు కేవలం పేరు ప్రతిష్ఠలు, మన పాపపుణ్యాలే మనవెంట వస్తాయి. ఆస్తిపాస్తులు, బంధుబాంధవులు, పదవులు, పారితోషకాలు ఏవీ మన వెంటరావు. లోకంలో మంచి, చెడులు ప్రజలలో ఉండిపోతాయి. కనుక పుట్టిన రోజు వేడుకలతోబాటు ఆత్మోన్నతికి కొన్ని మంచి పనులు ప్రారంభిస్తే బాగుంటుంది. అందుకు తగిన ప్రేరణను కలిగించే విధంగా ఆ వేడుకను జరుపుకుంటే మనకు, ఆహ్వానితులకు కూడా ఎంతో మేలు జరుగుతుంది.

అదృష్టవశాత్తు మనం భారతదేశంలో, వేదభూమిలో, కర్మభూమిలో, తపోభూమిలో జన్మించి జీవితాలు గడుపుతున్నాము. కాని, నవ నాగరికత పేరుతో పాశ్చాత్య నాగరికతకు బానిసలౌతున్న వారి సంఖ్యనే పెరుగుతున్నది. భారతీయార్యులు ఏ శుభకార్యం జరుపుకున్నా, వేడుకలు పండుగులు జరుపుకున్నా దీపారాధన చేసి దైవప్రార్థన చేసుకొని ప్రారంభిస్తారు. కాని నేడు పుట్టిన రోజున పెద్దకేక్‌ను కొని, దానిపై చిన్న చిన్న కొవ్వొత్తులను ఏర్పాటుచేసి, వాటిని వెలిగించి, నోటితో ఊది ఆర్పమంటున్నారు. ఆ బంధుబాంధవులు, ఆహ్వానితులు చప్పట్లు కొడుతూ "Happy Birthday to you" అంటూ ఆశీస్సులు చెబుతున్నారు. కేక్‌ను కట్ చేసి ప్రసాదంగా పంచుతున్నారు. ఇది మన సంస్కృతి ఎంతమాత్రం కాదు. మనది దీపాలు ఆర్పే సంస్కృతి కాదు. దీపాలు వెలిగించే సంస్కృతి. కేక్ మన సంప్రదాయక తీపి ప్రసాదంకన్న పవిత్రమైనది కాదు.

'దీపం' జ్ఞానానికి ప్రతీక. దీపం చీకటిని పారద్రోలి వెలుగును ప్రసాదిస్తుంది. ఆ వెలుగులో వస్తువులు స్పష్టంగా కనబడతాయి. అట్లే జ్ఞానం మనలోని అజ్ఞానాంధకారాన్ని పోగొట్టి వెలుగును ప్రసాదిస్తుంది. దానితో సృష్టిలోని పదార్థాల

యథార్థస్థితి అవగతమౌతుంది. కనుకనే ఏవైనా సభలు, సమావేశాలు, సెమినార్లు ప్రారంభించేముందు పెద్దవారితో జ్యోతిప్రజ్వలన చేయించి ప్రారంభిస్తారు. అట్లే మన జన్మదిన వేడుకలను జరుపుకోవాలి. పిల్లలుకాని, పెద్దలుకాని గడిచిన సంవత్సరాలెన్నో, అన్ని దీపాలు వెలిగిస్తే ఇంకా మంచిది. ఒక సంవత్సరం గడిస్తే మన జ్ఞానం మరికొంత పెరుగుతుంది. అలా ఎన్ని సంవత్సరాలు గడిస్తే, అంతగా మన జ్ఞానం పెరుగుతూ ఉంటుంది. అనుభవం పెరుగుతూ ఉంటుంది. క్రొత్త క్రొత్త విషయాలు, పరిశోధనలు, అవిష్కారాలు తెలుస్తూ ఉంటాయి. దానితో మన సుఖసాధనాలు పెరుగుతూ ఉంటాయి. మన సుఖానుభవం పెరుగుతూ ఉంటుంది. దీపాలు ఆర్పుతూ ఉంటే అంధకారం పెరుగుతుందా? తగ్గుతుందా? మీరే ఆలోచించండి.

సంఖ్యతగ్గుతున్నా ఇప్పటికీ కొందరు జన్మదినాలను ఆదర్శవంతంగా జరుపుకుంటున్నారు. ఆ రోజు గతాన్ని స్మరిస్తూ తన ఉన్నతికి కారుకులైన వారిని స్మరించి కృతజ్ఞతలు తెలుపుకుంటూ, పరమేశ్వరుడు తనకు చేసిన మహోపకారాలను గుర్తు చేసుకుంటూ శ్రద్ధా భక్తులను పెంచుకునే వారున్నారు. పెద్దలను కలుసుకొని ఆశీస్సులు పొందేవారు, మిత్రులను కలుసుకొని ధన్యవాదాలు చెప్పేవారు, ఆ రోజు పేదలకు తమ సేవలందించేవారు ఉన్నారు. ఆ రోజు చాలా నిరాడంబరంగా ఏదైనా అనాథాలయానికి వెళ్లి అక్కడి వారికి పండ్లూ, మిఠాయిలు పంచుతూ వారి మధ్యనే ఆ రోజంతా గడిపే విశాల హృదయులు కూడా కొందరున్నారు. అటువంటి వాటిలో మనం చెయ్యగలిగిన పరోపకారం చెయ్యటం ఎంతైనా మంచిది. మన ప్రాచీన ఋషులేమన్నారంటే-

శ్లో॥ "శ్లోకార్థేన ప్రవక్ష్యామి యదుక్తం గ్రంథకోటిభిః ।
పరోపకారః పుణ్యాయ, పాపాయ పరపీడనమ్" ॥ (మహాభారతం)

కోటి ధర్మగ్రంథాల సారాంశం ఒక్క అర్ధశ్లోకంలో చెబుతున్నాము. పుణ్యం=సుఖశాంతులు కలగాలంటే పరోపకారం చెయ్యండి. పాపం=దుఃఖాలు, కష్టాలు కావాలనుకుంటే పరులను పీడించండి" అన్నారు.

పూజలు, వ్రతాలు, భజనలు తీర్థయాత్రలవల్ల పుణ్యంరాదు. కేవలం

పరోపకారంవల్లా, త్యాగంవల్లా మాత్రమే పుణ్యం వస్తుంది. అది వెంటనే కనబడక పోయినా కాలాంతరంలోనైనా లేక జన్మాంతరంలోనైనా కనబడుతుంది.

"**న హి కళ్యాణకృత్ కశ్చిత్ దుర్గతిం తాత గచ్ఛతి** (భ.గీ. 6-40)

ఓ నాయనా! అర్జునా! లోకకళ్యాణంకొరకు, పరోపకారంకొరకు శ్రమించు వాడెన్నటికిని దుర్గతిని పొందడు" అంటారు మన ఆదర్శ కర్మయోగి శ్రీ కృష్ణుడు. అట్లే పాపఫలాలు వెంటనే కనబడకపోయినా కాలాంతరంలోనైనా లేక జన్మాంతరాలలోనైనా తప్పక కనబడతాయి.

శ్లో॥ **అవశ్య మను భోక్తవ్యం కృతం కర్మ శుభాశుభమ్ ।**
**నాభుక్తం క్షీయతే కర్మ కల్పకోటి శతైరపి ॥** (ధర్మసూత్రాలు)

చేసిన శుభాశుభ కర్మల ఫలాలు (పుణ్యపాప కర్మల ఫలాలు) ఎప్పటికైనా అనుభవించక తప్పదు. మనో వాక్కాయలలో వేటితోచేసినా కర్మఫలం అనుభవిస్తేకాని నశించదనేది సృష్టినియమం. కనుక నిరంతరం సత్కర్మలు-పరోపకార కర్మలు చేస్తూనే ఉండాలి. ఇక మనం వైదిక పద్ధతిలో జన్మదినం ఎలా జరుపుకుంటే ఆదర్శంగా ఉంటుందో, ఆత్మోన్నతిని కలిగిస్తుందో తెలుసుకుందాము.

## <u>అగ్నిహోత్ర సంకుచిత రూపమే ప్రమిద దీపం</u>

మన వైదికసంస్కృతి శుభకార్యాలన్నీ అగ్నిహోత్ర పూర్వకంగా జరుపుకోవాలంటుంది. '**నిషేకాది శ్మశానాన్తో మంత్రైః యస్య ఉదిత్ విధిః**'।

- ప్రథమ మానవ ధర్మస్మృతి మనుస్మృతి(2-16).

నిషేకం అంటే వివాహ స్త్రీ పురుషులకు జరిపే గర్భాధాన సంస్కారం. అది మొదలు శ్మశానంలో జరిగే శవదహన క్రియవరకు జరుపవలసిన 16 సంస్కారాలు వేదమంత్రాలతో, అగ్నిహోత్ర విధితో కలిపి జరుపు కోవాలంటాయి మన ధర్మశాస్త్రాలు. సృష్ట్యాది నుండి మహాభారతకాలం వరకు ఉన్న మన ప్రాచీన చరిత్రను పరిశీలించి చూసినట్లయితే జాతకర్మ నామకరణ ఉపయన వివాహాది 16 సంస్కారాలు అగ్నిహోత్ర పూర్వకంగానే జరుపుకున్నట్లు ప్రమాణాలున్నాయి. మహాభారత కాలానంతరం క్రమంగా అగ్నిహోత్రవిధి వక్రించి పశుహింస దానిలో భాగమయ్యింది. యజ్ఞాశాలలు

కబేలాలుగా మారాయి. ఆ దుస్థితిలోనే జైన బౌద్ధమతాలు ప్రారంభమయ్యాయి. దానితో వివేకవంతులకు, మానవతా వాదులకు అగ్నిహోత్రంపై ఏవగింపు కలిగింది. అందుచే యజ్ఞయాగాలు క్రమంగా కనుమరుగైనాయి. వేదాలలో ఎక్కడా పశుహింసతో కూడిన యజ్ఞాల వర్ణన లేనేలేదు. ఇంతేగాక **"గాం మా హింసీః, అవిం మా హింసీః, పశూన్‌పాహి, శం నో అస్తు ద్విపదే శం చతుష్పదే"** అనే వాక్యాలు పలుచోట్ల కనబడతాయి. కేవలం యజ్ఞాల పేరుతోనే కాదు ఏ రకంగాను పశు పక్ష్యాదులను హింసించ వద్దంటాయి మన వేదశాస్త్రాలు. బహుశః ఈ యాజ్ఞికహింస తంత్రగ్రంథాలవల్ల ప్రచలితమై ఉండవచ్చు.

యజుర్వేదం అగ్నిహోత్రంవల్ల కలిగే అనేకానేక ప్రయోజనాలను వేనోళ్ల కీర్తిస్తుంది. అగ్నిహోత్ర కార్యం వేదమూలకమే. బ్రహ్మచర్య గృహస్థ వానప్రస్థులంతా దైనిక అగ్నిహోత్రం ఉదయ సాయంకాలలో తప్పక చేసేవారు. లోక కళ్యాణం కొరకు రాజులు, మహారాజులు అశ్వమేధ, రాజసూయాది పెద్ద పెద్ద యజ్ఞాలు నిర్వహించేవారు. వాతావరణాన్ని శుద్ధి చేసేవారు. దానితో అతివృష్టి, అనావృష్టి, అతి శీతతాపాలు శాంతించి అనుకూలంగా మారేవి. ఆ సందర్భంలో అన్ని వర్గాల ప్రజలను తగిన విధంగా సత్కరించేవారు. దేశం ఐక్యమత్యంతో సర్వతో ముఖాభివృద్ధి చెందేది.

మధ్యకాలంలో జరిగిన ఈ యాజ్ఞిక హింసవల్లనూ, నాస్తికమతాల ప్రభావం వల్లనూ ప్రజలు అగ్నిహోత్ర కార్యానికి దూరమయ్యారు. దానికి ప్రతీకగా ఆవునేతితో ప్రమిద దీపాన్ని పెట్టుకొని శుభకార్యాలను జరుపుకోవటం ప్రారంభించారు. ఏది యేమైనా ఆవునేతి దీపం అగ్నిహోత్రానికి సమానం కాదు. ఆవునేతి దీపంవల్ల కొద్ది ప్రయోజనమే కలుగుతుంది. అదే ఆవునేతిని విధిప్రకారం అగ్నిహోత్రంలో ఆహుతులుగాయిస్తే భూలోక భువర్లోకాలలో వ్యాపించి, సూక్ష్మాంశం స్వర్లోకానికి అంటే ఆదిత్యున్ని (సూర్యున్ని) చేరుతుంది. సూర్యుని నుండి వెడలే వృష్టి సర్జన కిరణాలను ప్రేరేపించి సమయానుకూల వర్షాలను కురిపిస్తుంది. అందుచేతనే శ్రీ కృష్ణ భగవానుడు గీతలో **'యజ్ఞాత్ భవతి పర్జన్యః'**-(3-14) అన్నారు. అగ్నిహోత్ర వైజ్ఞానిక వివరణకొరకు నా రచనలు "అగ్నిహోత్రం 100% వైజ్ఞానికం", "అగ్నిహోత్ర రాసాయనిక విశ్లేషణ(Chemical Analysis of Agnihotra) చదువ గోరుచున్నాము. అట్టి

అగ్నిహోత్రాన్ని మహర్షి దయానందులవారు పునరుద్ధరించి మనకు విశదపరచారు. విధి విధానాలను వెలుగులోనికి తెచ్చారు. "షోడశ సంస్కారవిధి" అనే పేరుతో ఒక చక్కటి మార్గదర్శక గ్రంథాన్ని వ్రాశారు. షోడశ సంస్కారాలవలెనే పుట్టిన రోజును ఒక ఉపసంస్కారంగా చేసుకుంటే చాలా చాలా ప్రయోజనాలుంటాయి. అందుకు ఆ రోజు నిద్రలేచినప్పటినుండి శరీరాన్ని, మనస్సును, బుద్ధిని, ఆత్మను సిద్ధం చేసుకోవాలి ఎట్లంటే -

## పుట్టిన రోజు దినచర్య

పుట్టిన రోజు పెందలకడనే నిద్రలేచి ముందు మనను పుట్టించిన పరమాత్మను ప్రార్థించాలి. అమ్మ మనకు జన్మనిచ్చినా అమ్మకడుపులో అమ్మరక్తంతో మనకు ఉత్తమ మానవ శరీరాన్ని నిర్మించిన కర్త పరమాత్మనే కదా! ఏవేవో శ్లోకాలతో, వాక్యాలతో ప్రార్థించటంకన్న వేదమంత్రాలతో ప్రార్థించటం ఉత్తమం. వైదిక దినచర్య పుస్తకాలలో ప్రాతఃస్మరణ మంత్రాలుంటాయి. వాటి అర్థాలతో కూడిన పుస్తకాలు కూడా దొరుకుతాయి. మా ప్రచురణ "వైదిక సుప్రభాతం" లో వాటి వైజ్ఞానిక వివరణ కూడా ఉంది. వాటితో కేవలం పుట్టినరోజునే కాకుండా ప్రతిరోజు ప్రార్థించుకోవటం మంచిది. అనంతరం కొద్దిసేపు ఆత్మ పరమాత్మలను గురించి ఆలోచించాలి. అంటే - "నేను ఈ శరీరాన్ని కాదు. కాలాంతరంలో ఈ శరీరం నశించినా జీవాత్మనైన నేను నశించను. పరమాత్మ నాకు మరొక శరీరాన్ని నిర్మించి యిస్తాడు. ఈ మానవ శరీరం కర్మయోని. పురుషార్థం చేసి పుణ్యాన్ని సంపాదించుకోవాలి. ఈ జన్మలో అభ్యుదయాన్ని - ఉన్నతిని పొందటమేకాక, వచ్చేజన్మ ఇంతకన్న ఉత్తమ జన్మను పొందే ప్రయత్నం చేస్తాను" అని సంకల్పించు కోవాలి. పరమాత్మ సర్వవ్యాపక తత్త్వము. అది సృష్టి స్థితి ప్రళయాలు చేస్తూ ఉండటమేగాక నేను మనోవాక్కాయాలతో చేసే ప్రతీకర్మను నిరీక్షిస్తూ ఉంది. కనుక నేను ఏ పాపకార్యం చెయ్యను. అధర్మంగా ప్రవర్తించను...." అని సంకల్పం చేసుకొని పడకను విడిచి కాలకృత్యాలు తీర్చుకోవాలి.

జన్మదినంనాడు అభ్యంగన స్నానం చెయ్యటం మంచిది. అంటే - ముందు ఒళ్లంతా పలుచగా నూనె రాచుకొని కొద్దిసేపు ఆగి నలుగు పిండి రాచుకొని నలుగు పెట్టుకోవాలి. నూనె రాచుకోవటం వల్ల చర్మరంధ్రాలలో ఉండే మట్టికూడా

కరిగిపోతుంది. నలుగు పెట్టుకోవటంతో నూనెతోబాటు ఆ మట్టంతా రాలిపోతుంది. సబ్బుతో చేసే స్నానం పైపైన ఉండే మురికిని పోగొట్టగలుగుతుందే కాని చర్మరంధ్రాలలోని మురికిని పోగొట్టలేదు. ఇంతేగాక అది చర్మానికి ఉండే సహజతైలాన్ని కూడా పోగొట్టి పొడిచర్మంగా (Dry Skin గా) చేస్తుంది. శుద్ధమైన నూనెను చెవులలో కూడా పోసుకోవటం మంచిది. గులిమి కరిగి చెవిలో మృదుత్వం ఏర్పడుతుంది.

అనంతరం క్రొత్త బట్టలుగాని, శుద్ధమైన వస్త్రాలు గాని ధరించి సంధ్యా అగ్నిహోత్రాలు చేసుకోవాలి. అమ్మనాన్నలకు, పెద్దవారికి పాదాభివందనం చేసి వారి ఆశీర్వాదాలు పొందాలి. రోజంతా ప్రసన్నంగా బంధుమిత్రులతో గడపాలి. వీలైతే కొంతసేపు సత్సంగాలలో గడపాలి. సాధు సంన్యాసుల ఆశీర్వాదాలు, ఉపదేశాలు పొందాలి. ఇక మనం జన్మదిన విశేష హోమాన్ని గురించి తెలుసుకుందాము.

## బృహత్ యజ్ఞవిధి - సామాన్యప్రకరణం

బృహత్ యజ్ఞవిధిని శాస్త్రాలలో 'సామాన్య ప్రకరణం' అని పేర్కొనటం జరిగింది. అంటే - అన్ని సంస్కారాలలోను, శుభకార్యాలలోను ముందుగా నిర్వహించవలసిన యజ్ఞవిధి (Common Yagnic Rituals). దీనిలో సంకల్పం, ఋత్విక్ వరణం, ఆచమన అంగస్పర్శలు, పరమేశ్వర స్తుతి ప్రార్థనోపాసనలు, స్వస్తివాచనం, శాంతి కరణం, అగ్న్యాధాన సమిధాధానాది చాలా క్రియలుంటాయి. అవన్నీ ఇక్కడ వ్రాస్తే చాలా పెద్ద పుస్తకం అవుతుంది. మీకు, మాకు భారం అవుతుంది. కనుక, వాటిని 'వైదిక దినచర్య' పుస్తకాలను అనుసరించి చేసుకోగోరుచున్నాము. ఇక్కడ జన్మదిన విశేష హోమ విధిని మాత్రమే సరళార్థంతో తెలుపుచున్నాము.

## అథ వర్ధాపన ఉపసంస్కార విధి:

జన్మదినాన్నే శాస్త్రాలలో వర్ధాపనదినంగా పేర్కొనటం జరిగింది. పైన పేర్కొన్న విధంగా బృహత్ యజ్ఞవిధిని పూర్తిచేసి ఈ క్రింది మంత్రాలతో కొద్దిసేపు పరమేశ్వరుని ఉపస్థానం-విశేషప్రార్థన చేసుకోవాలి.

**1. ఓం ఉపప్రియం పనిప్నతం యువానామ్ + ఆహుతీవృధమ్ ।**
**అగన్మ బిభ్రతో నమో దీర్ఘమాయు: కృణోతు మే ॥**

– అథర్వవేదం (7-32-1)

ఓ అంతర్యామీ! ఓం నామక సర్వవ్యాపక సర్వేశ్వరా! నీవు నాకు అత్యంత సన్నిహిత మిత్రుడవు (Nearest and dearest friend). నీవు సదా యువకుడవు. సృష్టి కార్యాలు చేయటంలోగాని, కర్మఫలాలను అనుభవింప జేయటంలోగాని నీకు ఎవరి సహాయం అక్కరలేదు. నీవు సర్వశక్తిమంతుడవు. సర్వజ్ఞుడవు. నన్ను సదా సత్కర్మలు చేయ ప్రేరేపిస్తూ నా ఆయువును దీర్ఘం చేయుము.

**2. ఓం సం మా సించంతు మరుతః సం పూషా సం బృహస్పతిః।**
**సం మా అయమగ్నిః సించతు ప్రజయా చ ధనేన చ దీర్ఘమాయుః కృణోతు మే ॥**

– అథర్వవేదం (7-33-1)

ఓ అంతర్యామీ! నీవు నిర్మించి యిచ్చిన ఈ శరీరంలోని మరుత్తులు - దశవిధ ప్రాణశక్తులు నన్ను చక్కగా బలపరచును గాక! సర్వప్రాణులకు ఆహారాన్ని ఇచ్చి పోషించు ఈ భూమాత నన్ను చక్కగా పోషించును గాక! ఆచార్యులు నాకు చక్కటి జ్ఞానము నిచ్చి కాపాడుదురు గాక! శరీరంలోని జఠరాగ్ని మొదలగు అగ్నులు నన్ను చక్కగా బలపరచును గాక! ఇవన్నీ నాకు ఉత్తమ సంతానాన్ని, వివిధ ధనములను ఇచ్చి నా ఆయువును దీర్ఘం చేయును గాక!

**3. ఓం ఉద్వయం తమసస్పరి స్వః పశ్యన్త ఉత్తరమ్।**
**దేవం దేవత్రా సూర్య మగన్మ జ్యోతి రుత్తమమ్॥**

– యజుర్వేదం (35-14)

ఓ అంతర్యామీ! నీ విచ్చిన దీర్ఘాయువును మేము సద్వినియోగం చేసుకొందుముగాక! జీవితాన్ని యజ్ఞమయం చేసుకుంటూ యోగాభ్యాసం చేయుదుముగాక!

మేము అంతర్ముఖులమై అజ్ఞానాంధకారాన్నుండి పైకెగిరి నీ ఆనంద స్వరూపమును దర్శింతుము గాక! ఇంకను పై కెగిరి జడచేతన దేవతలకు దివ్యగుణాలను ప్రసాదించు దేవత్రా సూర్యుడవైన నిన్ను దర్శించి - ఉపాసించి

మేమును నీ నుండి కొన్ని దివ్యగుణాలను పొంది దేవతల మగుదుముగాక!

శ్రద్ధాభక్తులు గలవారు పై మూడు మంత్రాలను సరళార్థంతో కూడా పఠించడం మంచిది. సమయం తక్కువగా ఉన్నవారు 1 లేదా 2 మంత్రాలు పఠించవచ్చు. యజమాని (యజ్ఞం చేయించుకునేవారు) కళ్లు మూసుకొని హృదయస్థానంలో మనస్సును నిలిపి పఠించాలి కనుక అది అందరికి సాధ్యంకాక పోవచ్చు. కనుక పురోహితులు పలికించవచ్చు.

ఇప్పుడు జన్మదినాలను పెద్దవారు, విద్యార్థినీ విద్యార్థులు జరుపుకోవటమేకాక పసిపిల్లలకును తల్లిదండ్రులు జన్మదినాలను వేడుకగా జరిపించుకుంటున్నారు. అట్టివారు తమ పిల్లల కుడిచెవిలో ఈ క్రింది మంత్రం పఠించాలని విద్వాంసులు సూచించారు.

**ఓం మేధాం తే దేవః సవితా మేధాం దేవీ సరస్వతీ ।**
**మేధాం తే అశ్వినౌ దేవావాధత్తాం పుష్కర స్రజౌ ॥**

– ఆశ్వలాయన గృహ్యసూత్రాలు (1-15-2)

<u>సరళార్థం</u> : ఓ బాలకా! (లేదా ఓ బాలికా!) సృష్టికర్తయైన దేవదేవుడు, సరస్వతీ దేవి, అశ్వినీ దేవతలు నీకు అజ్ఞాన నాశక మేధాబుద్ధిని ప్రసాదింతురుగాక!

<u>వివరణ</u> : ఇచ్చట సవిత అంటే "(షూజ్-ప్రాణి ప్రసవే) విశాలవిశ్వాన్ని అందలి సమస్త ప్రాణులను సృజించిన వాడు" అని అర్థం. "సవితా సర్వస్య ప్రసవితా" -నిరుక్తం (10-31) అని నిర్వచనం. 'సరస్వతీ దేవి' అంటే- సర్వవిద్యా ప్రదాయని వేదం అనీ, సకల విద్యాప్రదాత పరమేశ్వరుడూ నని అర్థం. 'మేధా' అంటే- (మేదృ-హింసనే) మనస్సులోని అజ్ఞాన, అధర్మ, అసత్య పాఖండాదులను పోగొట్టే 'వివేక బుద్ధి' అని అర్థం. (కొందరు విద్వాంసులు ఇట్టివే పారశ్కర గృహ్యా సూత్రాలలోని కొన్ని మంత్రాలు వ్రాశారు. వాటిలో ప్రాకృతిక శక్తులన్నీ ఈ పిల్లలకు దీర్ఘాయువును ప్రసాదించాలనే ప్రార్థనలున్నాయి. వాటిని చిన్న పిల్లలు ఏమి అర్థం చేసుకోగలరు? కనుక వాటిని ఇక్కడ వ్రాయలేదు. తెలుసుకోగోరువారు మహర్షి దయానందులవారి సంకలన రచన 'సంస్కారవిధి' లోని జాతకర్మ సంస్కారంలో చూడగోరుచున్నాము).

అనంతరం జన్మదినం జరుపుకునే వారు జన్మించిన తిథి, నక్షత్రాలతోను,

వాటికి సంబంధించిన దేవతలతోను నేతి ఆహుతులివ్వాలి. వీటి వివరాలుకూడా 'సంస్కారవిధి'లోని నామకరణ సంస్కారంలో ఉన్నాయి. ఆ పుస్తకాలు అందరివద్ద ఉండకపోవచ్చు. కనుక ఇక్కడ వ్రాస్తున్నాము.

నవ నాగరికత ప్రభావంతో ఆంగ్లతేదీలకు అలవాటు పడిపోయి తాము లేదా తమ పిల్లలు జన్మించిన తిథి, నక్షత్రాలను జ్ఞాపకం పెట్టుకోకుండా ఆంగ్ల తేదీలలోనే జన్మదినాలు జరుపుకుంటున్నారు. అట్టివారు ఆ ఆంగ్లతేదీ నాటి తిథి నక్షత్రాలకు చెందిన 4 ఆహుతులు ఇవ్వండి. ఇక ముందైనా చాంద్రమాన జన్మతిథి నక్షత్రాలను గుర్తుపెట్టుకొని ఆ తిథినాడే జరుపుకోవటం మంచిది. మన సంస్కృతీ సభ్యతలపై శ్రద్ధా భక్తులను, స్వాభిమానాన్ని కలిగి ఉండటం ఉత్తమం. అవి పూర్తిగా వైజ్ఞానికంగా ఉంటాయి. రాత్రిపూట ఆకాశంలో చంద్రుని గమనిస్తే ఆ రోజు ఏ తిథియో చెప్పవచ్చును. ఆ చంద్రుని సమీపంలో ఉండే నక్షత్రవలయ భాగాన్నే ఆ దినానికి చెందిన నక్షత్రం అంటాము. రాత్రిపూట ఆకాశాన్ని పరిశీలించే అలవాటు చేసుకుంటే పంచాంగం లేదా కాలెండరు చూచే అవసరం లేకుండానే ఆనాటి తిథి నక్షత్రాలను చెప్పవచ్చును.

మరొక మాట-నేడు జ్యోతిషగణను కూడా కంప్యూటరైజ్ చేశారు. కనుక మీ జన్మదిన ఆంగ్లతిథి (తారీఖు-date), పుట్టిన సమయం చెబితే ఆ సమయానికి ఏ తిథి వార నక్షత్రాలున్నాయో కంప్యూటర్లు చెబుతాయి. (దానికి తగిన Software ఉంటే).

ఈ దిగువ తిథి నక్షత్రాల పట్టిక చతుర్థీ విభక్తిలో ఉంది. అంటే ఆ నేతి ఆహుతిని ఆ తిథికి, తిథికి చెందిన దేవతకు అర్పిస్తున్నాను అనే అర్థం వస్తుంది. అట్లే నక్షత్ర విషయంలో కూడా అని గ్రహించండి.

| | జన్మతిథికి | తిథి దేవతకు |
|---|---|---|
| 1. | ఓం ప్రతిపదే స్వాహా | ఓం బ్రహ్మణే స్వాహా |
| 2. | ఓం ద్వితీయాయై స్వాహా | ఓం త్వష్ట్రే స్వాహా |
| 3. | ఓం తృతీయాయై స్వాహా | ఓం విష్ణవే స్వాహా |
| 4. | ఓం చతుర్థ్యై స్వాహా | ఓం యమాయ స్వాహా |

| | | |
|---|---|---|
| 5. | ఓం పంచమ్యై స్వాహా | ఓం సోమాయ స్వాహా |
| 6. | ఓం షష్ఠ్యై స్వాహా | ఓం కుమారాయ స్వాహా |
| 7. | ఓం సప్తమ్యై స్వాహా | ఓం మునయే స్వాహా |
| 8. | ఓం అష్టమ్యై స్వాహా | ఓం వసవే స్వాహా |
| 9. | ఓం నవమ్యై స్వాహా | ఓం శివాయ స్వాహా |
| 10. | ఓం దశమ్యై స్వాహా | ఓం ధర్మాయ స్వాహా |
| 11. | ఓం ఏకాదశ్యై స్వాహా | ఓం రుద్రాయ స్వాహా |
| 12. | ఓం ద్వాదశ్యై స్వాహా | ఓం వాయవే స్వాహా |
| 13. | ఓం త్రయోదశ్యై స్వాహా | ఓం కామాయ స్వాహా |
| 14. | ఓం చతుర్దశ్యై స్వాహా | ఓం అనంతాయ స్వాహా |
| 15. | ఓం పూర్ణిమాయై స్వాహా | ఓం విశ్వదేవేభ్యః స్వాహా |
| 16. | ఓం అమవాస్యాయై స్వాహా | ఓం పితృభ్యః స్వాహా |
| | **నక్షత్రమునకు** | **నక్షత్రదేవతకు** |
| 1. | ఓం అశ్విన్యై స్వాహా | ఓం అశ్విభ్యాం స్వాహా |
| 2. | ఓం భరణ్యై స్వాహా | ఓం యమాయై స్వాహా |
| 3. | ఓం కృత్తికాయై స్వాహా | ఓం అగ్నయే స్వాహా |
| 4. | ఓం రోహిణ్యై స్వాహా | ఓం ప్రజాపతయే స్వాహా |
| 5. | ఓం మృగశీర్షాయ స్వాహా | ఓం సోమాయ స్వాహా |
| 6. | ఓం ఆర్ద్రాయై స్వాహా | ఓం రుద్రాయ స్వాహా |
| 7. | ఓం పునర్వసవే స్వాహా | ఓం అదితయే స్వాహా |
| 8. | ఓం పుష్యమ్యై స్వాహా | ఓం బృహస్పతయే స్వాహా |
| 9. | ఓం ఆశ్లేషాయై స్వాహా | ఓం సర్పాయ స్వాహా |
| 10. | ఓం మఘాయై స్వాహా | ఓం పిత్రే స్వాహా |
| 11. | ఓం పూర్వా ఫల్గున్యై స్వాహా | ఓం భగాయ స్వాహా |

| | | |
|---|---|---|
| 12. | ఓం ఉత్తరా ఫల్గున్యై స్వాహా | ఓం అర్యమ్ణే స్వాహా |
| 13. | ఓం హస్తాయ స్వాహా | ఓం సవిత్రే స్వాహా |
| 14. | ఓం చిత్రాయై స్వాహా | ఓం త్వష్ట్రే స్వాహా |
| 15. | ఓం స్వాతయే స్వాహా | ఓం వాయవే స్వాహా |
| 16. | ఓం విశాఖాయై స్వాహా | ఓం ఇంద్రాగ్నీభ్యాం స్వాహా |
| 17. | ఓం అనురాధాయై స్వాహా | ఓం మిత్రాయ స్వాహా |
| 18. | ఓం జ్యేష్ఠాయై స్వాహా | ఓం ఇంద్రాయ స్వాహా |
| 19. | ఓం మూలాయ స్వాహా | ఓం నిరృతయే స్వాహా |
| 20. | ఓం పూర్వాషాఢాయై స్వాహా | ఓం అద్భ్యః స్వాహా |
| 21. | ఓం ఉత్తరాషాఢాయై స్వాహా | ఓం విశ్వేదేవేభ్యః స్వాహా |
| 22. | ఓం శ్రవణాయ స్వాహా | ఓం విష్ణవే స్వాహా |
| 23. | ఓం ధనిష్ఠాయై స్వాహా | ఓం వసవే వసుభ్యః స్వాహా |
| 24. | ఓం శతభిషజే స్వాహా | ఓం వరుణాయ స్వాహా |
| 25. | ఓం పూర్వాభాద్రపదాయై స్వాహా | ఓం అజైకపాదే స్వాహా |
| 26. | ఓం ఉత్తర భాద్రపదాయై స్వాహా | ఓం అహిర్బుధ్న్యాయ స్వాహా |
| 27. | ఓం రేవత్యై స్వాహా | ఓం పూష్ణే స్వాహా |

## స్వస్తి హోమం

అనంతరం ఈ క్రింది 4 ఆహుతులు ఘృత శాకల్యాలతో నెయ్యి. హవన సామగ్రి (మూలికలతో) యివ్వాలి.

**1. ఓం . ఆ నో భద్రాః క్రతవో యంతు విశ్వతోऽ దబ్ధాసో అపరీతాస ఉద్భిదః ।**
**దేవా నో యథా సదమిద్వృధే, అసన్నప్రాయువో రక్షితారో దివేదివే స్వాహా॥**

- యజుర్వేదం (25-14)

<u>సరళార్థం</u> : ఓ సర్వాంతర్యామీ! నీ అనుగ్రహంవల్ల మాకు అన్ని వైపుల నుండి భద్రములైన క్రతువులే-యజ్ఞాది సత్కర్మలే ప్రాప్తించునుగాక! అన్ని వైపులనుండి

మంచి ఆలోచనలే వచ్చునుగాక! ఆ ఆలోచనలు అదబ్ధాసములు (హింసారహితములు), అపరీతములు (విపరీతములు కానివి), ఉద్భిదములు(మొలకెత్తి వికసించునవి) అగునుగాక! మా విద్వాంసులు, గురువులు, పెద్దలు ఎల్లప్పుడు మమ్ము ఉన్నతివైపు నడిపింతురుగాక! మా అసన్నులు-సహాయకులు సదా జాగరూకులై ప్రతి దినము మమ్ము కాపాడుచుందురుగాక!

**2. ఓం దేవానాం భద్రా సుమతిర్ృజూయతామ్**
**దేవానాం రాతిరభి నో నివర్త తామ్ ।**
**దేవానాం సఖ్యముపసేదిమా వయమ్**
**దేవా న ఆయుః ప్రతిరంతు జీవసే స్వాహా॥**

- యజుర్వేదం. (25-15)

<u>సరళార్థం</u> : హే పరమేశ్వరా! దేవతల భద్రమైన మంచి బుద్ధిని మాకు ప్రసాదింపుము. వారితో సాంగత్యంచేసి వారి దాన ప్రవృత్తిని మేమును పొందుదుముగాక! వారి దినచర్యను అనుసరించి మేమును దీర్ఘాయువును పొందుదుముగాక! వారు మమ్ము దేవతలమగుటకు ప్రేరేపింతురుగాక!

**3. ఓం భద్రం కర్ణేభిః శృణుయామ దేవా**
**భద్రం పశ్యేమాక్షభిర్యజత్రాః ।**
**స్థిరై రంగైస్తుష్టువాగ్ం సస్తనూభి**
**ర్వ్యశేమహి దేవహితం యదాయుః స్వాహా॥** - యజుర్వేదం (25-21)

<u>సరళార్థం</u> : హే సర్వవ్యాపక సర్వేశ్వరా। విద్వాంసుల సాంగత్యంలో ఉంటూ మేము సదా భద్రవచనములనే విందుముగాక! భద్రమైన వాటినే చూతుముగాక! ఓ సృష్టిరూప యజ్ఞము చేయు పరమేశ్వరా! నీ కృపవలన మా శరీరాంగములన్నీ స్థిరంగాను, దృఢంగాను ఉండును గాక! వాటితో మేము సదా నిన్ను స్తుతించుచు నీ వేదాజ్ఞలను పాటించుచు నీ విచ్చిన ఆయువును పూర్ణంగా అనుభవింతుము గాక! వ్యసనములలో పడి జీవితాన్ని నష్టం చేసుకొనకుందుముగాక!

**4. ఓం తచ్చక్షుర్దేవహితం పురస్తాచ్ఛుక్రముచ్చరత్ ।**
**పశ్యేమ శరదః శతమ్, జీవేమ శరదః శతమ్**

**శ్రుణుయామ శరదః శతం, ప్రబ్రవామ శరదః శతం**
**అదీనాః స్యామ శరదః శతం, భూయశ్చ శరదః శతాత్ స్వాహా ॥**
- యజుర్వేదం (36-24)

<u>సరళార్థం</u> : తత్ పద వాచ్యుడవైన ఓ పరమేశ్వరా! నీవు సర్వద్రష్టవు. సృష్టికి పూర్వమును, ఇప్పుడును, ప్రళయమందును నీవు ఏకరసుడవై, శుద్ధుడవై విలసిల్లు చుందువు. నీ కృపవలన మేమును నూరు సంవత్సరాలు చక్కగా చూతుముగాక! ఆరోగ్యంగా జీవింతుముగాక! విందుముగాక! ప్రవచింతుముగాక! పరాధీనులముకాకుండా బలవీర్యాలతో ఉందుముగాక! నూరు సంవత్సరాలకన్నను ఎక్కువగా జీవించ యత్నింతుముగాక!

## <u>స్థాలీ పాక హోమం</u>

'స్థాలీపాకం' అంటే అగ్నిహోత్రంలో ఆహుతులిచ్చుటకొరకు గిన్నెలో వండిన చక్కెర పొంగలి, పరమాన్నం, పాయసం, హల్వావంటి వాటిలో ఏదో ఒకటి. దానిలో కొద్ది ఆవునేతిని కలిపి ఈ క్రింది మంత్రాలతో ఆహుతులివ్వాలి.

**1. ఓం అగ్న ఆయూంషి పవస ఆ సువోర్జమిషం చ నః ।**
**ఆరే బాధస్వ దుచ్ఛునామ్ స్వాహా ॥** - యజుర్వేదం (35-16)

<u>సరళార్థం</u> : ఓ జ్ఞాన ప్రకాశ స్వరూప పరమేశ్వరా! మా ఆయువును, జీవితమును పవిత్రపరచుము. మాకు బలమును, అన్నాది ఆహార పదార్థాలను చేకూర్చుము. మాలోని దుర్భావాలను, దుర్వ్యసనాలను దూరంచేయుము.

**2. ఓం ఆయుష్మా నగ్నే హవిషా వృధానో ఘృతప్రతీకో ఘృతయోనిరేధి ।**
**ఘృతం పీత్వా మధు చారు గవ్యం పితేవ పుత్రమభి రక్షతాది మాన్త్ స్వాహా॥**
- యజుర్వేదం (35-17)

<u>సరళార్థం</u> : ఓ యజ్ఞాగ్నీ! మధురము శ్రేష్ఠమునైన ఈ గోఘృతమును స్వీకరించి నీవు పెద్ద పెద్ద జ్వాలలతో వర్ధిల్లుము. నిన్ను ఉపాసించు మమ్ములను కూడా వర్ధిల్లజేయుము. జలవాయువులను శుద్ధపరచి తద్వార మమ్మును, మా గోవులను బలవీర్య ఆరోగ్యాలతో వర్ధిల్లజేయుము. తండ్రి పుత్రులను రక్షించునట్లు సదా నీవు మమ్ము రక్షించుచుండుము.

**3. ఓం నవోనవో భవసి జాయమానో అహ్నాం కేతురుషసామేష్యగ్రమ్ ।**

**భాగం దేవేభ్యో వి దధాస్యాయన్ ప్ర చంద్రమస్తిరసే దీర్ఘమాయుః స్వాహా॥**

– అథర్వ వేదం. (7-81-2)

<u>సరళార్థం</u> : ఓ చంద్రుడా! శుక్ల పక్షంలో నీవు ప్రవృద్ధమగునట్లే మమ్మును ప్రవృద్ధపరుచుము. ఉషస్సులకు ముందుండి నడిపించి పగటిని తీసుకువచ్చునట్లే నీవు మా జీవితాలను ప్రకాశపరచుము. నీ చల్లని వెన్నెలతో ఓషధులను, పంటలను సాంత్వన పరచి పుష్టివంతము చేయునట్లే మమ్మును సాంత్వన పరచి పుష్టివంతుల చేయుము. మా ఆయువును దీర్ఘం చేయుము.

**4. ఓం వాత ఆ వాతు భేషజం శంభు మయోభు నో హృదే।**

**ప్ర ణ ఆయూంషి తారిషత్ స్వాహా ॥** – ఋగ్వేదం (10-186-1)

<u>సరళార్థం :</u> ఓ ప్రాణవాయువా! సృష్టికర్తచే సృజింపబడిన నీవు మమ్ములను జీవింపచేసే ఒక దేవతవు. ప్రాణాయామం ద్వారా ఎంత ఎక్కువగా నిన్ను సేవిస్తే అంతగా మాకు మేలు కలుగుతుంది. బలపరాక్రమాలు, సుఖసంతోషాలు పెరుగుతాయి. మా ఆయువు పెరుగుతుంది. రోగులకు నీవు ఒక భేషజానివి–ఔషధానివి.

**5. ఓం ఉత వాత పితాసి న ఉత భ్రాతోత నః సఖా।**

**స నో జీవాతవే కృధి స్వాహా॥** – ఋగ్వేదం (10-186-2)

<u>సరళార్థం</u> : ఓ ప్రాణవాయువా! నీవు మాకు పితవంటి వాడవు–పాలించి రక్షించేవాడవు. భ్రాతవలె–భరణ పోషణలు చేసేవాడవు. ఇంతేగాక, నీవు మాకు సఖుడవు–ప్రాణమిత్రుడవు కూడా. కనుక నీవు మాకు దీర్ఘజీవనమునిచ్చి కాపాడుము.

**6. ఓం ఆయురస్మై ధేహి జాతవేదః ప్రజాం త్వష్టరధినిధేహ్యస్మై।**

**రాయస్పోషం సవితరా సువాస్మై శతం జీవాతి శరదస్తవాయమ్ స్వాహా ॥**

– అథర్వవేదం (2-29-2)

<u>సరళార్థం</u> : ఓ జాతవేదా! ఉత్పన్న పదార్థాలనన్నిటి నెరుగు పరమేశ్వరా। ఈ యజ్ఞకర్తకు దీర్ఘాయువునిమ్ము. ఓ త్వష్టా! జడ చేతన జగత్తునంతటిని సుందరంగా నిర్మించిన శిల్పకర్తా! ఇతనికి ఉత్తమ సంతానాన్ని, బంధుమిత్రులను అధికంగా ప్రసాదింపుము.

ఓ సవితా! సృష్టికర్తా! ఇతనికి పుష్కలమైన పుష్టినిచ్చు ధనధాన్యాదులను సమకూర్చుము. ఈ యజ్ఞకర్తకు నూరు శరత్తుల జీవితాన్ని ప్రసాదింపుము.

**7. ఓం సవితా పశ్చత్తాత్ సవితా పురస్తాత్ సవితోత్తరాత్తాత్ సవితా ధరాత్తాత్।**

**సవితా నః సువతు సర్వతాతిం సవితా నో రాసతాం దీర్ఘమాయుః స్వాహా॥**

— ఋగ్వేదం (10-36-14)

సరళార్థం : సర్వజగత్తును సృజించిన సవిత మన ముందు తన మహిమతో వ్యాపించియున్నాడు. ఆ సవితయే మన వెనుక, పైన, క్రింద, అంతట, అన్నిట వ్యాపించియున్నాడు. అట్టి సవితాదేవుడు మన అవసరాల నన్నిటిని పూరించును గాక!

## ప్రధాన హోమము

ఘృత శాకల్యాలతో(హవన సామగ్రితో) ఈ క్రింది మంత్రాలతో ఆహుతులివ్వాలి.

**1. ఓం త్ర్యాయుషం జమదగ్నేః కశ్యపస్య త్ర్యాయుషమ్ ।**

**యద్దేవేషు త్ర్యాయుషం తన్నో౽ అస్తు త్ర్యాయుషమ్ స్వాహా ॥**

— యజుర్వేదం (3-62)

సరళార్థం : హే రుద్ర! దుష్టులను దండించి దారిలో పెట్టు ఓ సర్వవ్యాపక సర్వేశ్వరా! దివ్యగుణయుక్తులైన దేవతలు, ఋషులు ఏ మూడురెట్లు (300 సంవత్సరాల) ఆయువును అనుభవింతురో అట్టి త్రిగుణ ఆయువును మా కన్నులకు ప్రాప్తింప చేయుము. (చక్షుర్వై జమదగ్నిః-శత. 8-1-2-3). అట్లే, మా చెవులకును త్రిగుణ ఆయువును ప్రసాదింపుము.

**2. ఓం త్ర్యాయుషం జమదగ్నేః కశ్యపస్య త్ర్యాయుషమ్।**

**త్రేధామృతస్య చక్షణం త్రీణ్యాయూంషి తే ౽ కరమ్ స్వాహా ॥**

— అథర్వ వేదం (5-28-7)

సరళార్థం : హే సర్వాంతర్యామీ! నీ కృపవలన బాల్య యవ్వన వార్ధక్యములనెడి

3 రకముల ఆయువులతో మేము పెక్కు పరోపకారాది సత్కర్మలు చేయుదుముగాక! ఆ సత్కర్మల ఫలము నీ కర్పించి అమృతత్త్వమును పొందునట్లు నీవు మమ్ము ప్రేరేపింపుము.

**3. ఓం అగ్నిః ప్రాతః సవనే పాత్వస్మాన్ వైశ్వానరో విశ్వకృద్ విశ్వశంభూః ।**
**స నః పావకో ద్రవిణే దధాత్వా యుష్మన్తః సహ భక్షాః స్యామ స్వాహా॥**

– అథర్వవేదం (6-47-1)

<u>సరళార్థం</u> : హే అగ్నే! జ్ఞాన ప్రకాశక పరమేశ్వరా! మా ప్రాతఃకాల సవనంలోనికి – యజ్ఞంలోనికి – బ్రహ్మచర్యవ్రతంలోనికి నిన్ను సాదరంగా ఆహ్వానించుచున్నాము. మమ్ము రక్షించు. నీవు వైశ్వానరుడవు-సర్వనరుల హితకారివి. విశ్వకృతుడవు-జగత్కర్తవు. విశ్వశంభుడవు-సమస్త ప్రాణులకు సుఖముల నిచ్చు సుఖప్రదాతవు. పావకుడవు-మమ్ము పవిత్రపరచువాడవు. కనుక దయచేసి మాకు వివిధ ధనములను ప్రసాదింపుము. నీ కృపవలన మేము ఆయుష్మంతుల మగుదుముగాక! దీర్ఘకాలం ఆరోగ్యంగా, ఉత్సాహంగా ఆనందంగా ఉండునట్లు అనుగ్రహింపుము. నీవిచ్చిన ఆయువును మేమంతా కలిసిమెలసి అనుభవింతుముగాక! ఏక పంక్తిలో కూర్చొని భుజించువారము అగుదుముగాక!

**4. ఓం విశ్వేదేవా మరుత ఇన్ద్రో అస్మానస్మిన్ ద్వితీయే సవనే న జహ్యుః ।**
**ఆయుష్మన్తః ప్రియమేషాం వదన్తో వయం దేవానాం సుమతౌ స్యామ స్వాహా॥**

– అథర్వవేదం (6-47-2)

<u>సరళార్థం</u> : విశ్వదేవతలు, విద్వాంసులు, ఐశ్వర్య సంపన్నులు మా ద్వితీయ సవనంలో – రెండవ యజ్ఞంలో అంటే-యౌవనరూప జీవితంలో మమ్ము విడిచిపెట్టకుందరు గాక! మేము ప్రియవచనములతో వారి సాంగత్యంచేస్తూ సద్బుద్ధులను, సదాచారాలను, అలవరచుకొందుముగాక!

**5. ఓం ఇదం తృతీయం సవనం కవీనామృతేన యే చమసమైరయన్త।**
**తే సౌధన్వనాః స్వరానశానాః స్విష్టింనో అభి వస్యో నయన్తు స్వాహా॥**

– అథర్వవేదం (6-47-3)

<u>సరళార్థం</u> : జీవనరూప తృతీయ సవనంలో (యజ్ఞంలో)-మలివయస్సులో ఇబ్బంది

లేకుండా మేము అన్నాది కనీస అవసరాలను పొందుదుము గాక! జ్ఞానులు యోగులు మాకు ఆత్మ జ్ఞానాన్ని కలిగిస్తూ మానవ జీవితలక్ష్యమైన మోక్షం వైపు నడిపింతురు గాక! అష్టాంగయోగ మార్గమున నడుచునట్లు మమ్ము ప్రేరేపింతురు గాక!

వివరణ : ఈశ్వరీయ జ్ఞానమైన వేదం మానవ జీవితకాలాన్ని 3 భాగాలుగా విభజించి ఉపదేశిస్తుంది. అవే బాల్య యౌవ్వన వార్ధక్యాలు. వీటిని మన ఋషులు ఆశ్రమాలుగా పేర్కొన్నారు. వాటికి బ్రహ్మచర్య గృహస్థ వానప్రస్థాశ్రమాలని పేర్లు పెట్టారు. ఇక్కడ ఆశ్రమం అంటే–'ఆ సమంతాత్ శ్రమయతి యస్మిన్' అని నిర్వచించారు. ఆ యా ఆశ్రమాలలో చేయవలసిన విధి విధానాలను ధర్మ సూత్రాలలో, గృహ్యాసూత్రాలలో వివరించారు. కనుక 'ఆశ్రమం' అంటే ఆ యా జీవనకాలాలలో విధింపబడిన విధి విధానాలను నియమాలను పాటించటానికి గట్టి ప్రయత్నం చేయటమని గ్రహించాలి.

పై మూడు అథర్వవేద మంత్రాలు బ్రహ్మచర్య, గృహస్థ, వాన ప్రస్థాలను సవనము లంటున్నది. సవనం అంటే యజ్ఞమని అర్థం. కేవలం అగ్నిహోత్రమే యజ్ఞంకాదు. జీవితమే ఒక యజ్ఞంగా మార్చుకోవాలి. ఆ జీవన యజ్ఞంలో ఎవరెవరి సాంగత్యము, ప్రేరణ మనకవసరమో పై వేదమంత్రాలద్వార పరమేశ్వరుడు బోధించాడు. జన్మదినం రోజున వాటిని ఒకసారి స్మరించటం, మననం చేసి భావాన్ని గ్రహించటం, దానిని నిజ జీవితంలోనికి తెచ్చుకోవటం చాలా అవసరం.

ఈ విషయాన్నే యాజ్ఞవల్క్య మహర్షి తమ శతపథ బ్రాహ్మణంలో మీరు నిత్యాగ్నిహోత్రం చేసూ్తా చేసూ్తా క్రమంగా అగ్నిహోత్రాన్ని అంతరాత్మలో ధరించమంటాడు.

**" అథైవ దేవాః అన్తరాత్మన్నాదధత త ఇమమ్ అమృత మన్తరాత్మన్** (శత పథ బ్రా 2-2-14)" అన్నాడు. ఇంతేగాక, **"తదాహుః ఆత్మయాజీ శ్రేయాన్ దేవయాజీ ఇతి"** - దేవయాజీ కన్న ఆత్మయాజీయే గొప్పవాడు (శత.బ్రా 11-2-6-13) అన్నాడు. వివరంగా తెలుసుకోగోరువారు నా రచన "అగ్నిహోత్ర ఆధ్యాత్మిక స్వరూపము" చదువగోరుచున్నాను.

## ఆయుష్కామ హోమం

వయసు మళ్ళినవారు జన్మదినం జరుపుకుంటే ఈ క్రింది మంత్రాలతో విశేష హోమం చెయ్యాలి. ఈ మంత్రాలలో సించతు అనే పదము పలుమార్లు వస్తుంది. 'సించతు' అంటే నీటితో "తడపటం". ఏ విధంగా మనం పంట పొలాలను, మొక్కలను నీటితో తడుపుతూ వాటినుండి పంటలను పొందుతూ ఉంటామో, అట్లే సృష్టిలోని కొన్ని ప్రాకృతిక పదార్థాలు మన శరీరాలను తడుపుతూ జీవింపచేస్తున్నాయి. అవి-ఆహారపానీయాలు, గాలి, నీరు, సూర్యచంద్ర కిరణాలు మొదలగునవి. ఆహారపానీయాలు మన జీర్ణకోశంలో రసంగా (Lymph గా) మారి రక్తనాళాల ద్వారా ప్రతికణానికి అది ఇవ్వబడుతుంది. అట్లే గాలిలోని ఆక్సిజన్ ఊపిరితిత్తులలో రక్తంలో కలిసి ప్రతికణానికి చేరుతుంది. వాటి వల్ల శరీరంలోని కణాలు జీవిస్తున్నాయి. లేకుంటే అవి మరణిస్తాయి. అట్లే ప్రాకృతిక శక్తులు మన శరీరాలను తడుపుతున్నాయి-జీవింపచేస్తున్నాయి. 'సించంతు' పదము బహువచనంలో చెప్పబడింది.

**1. ఓం సం మా సించంతు మరుతః, సం పూషా సం బృహస్పతిః ।**
**సం మాయమగ్నిః సించంతు ప్రజయా చ ధనేన చ దీర్ఘమాయుః కృణోతు మే స్వాహా ॥** - అథర్వవేదం (7-33-1)

సరళార్థం : మరుత్తులు-వివిధ వాయువులు నా శరీరాన్ని చక్కగా తడుపును గాక! పుషా-పుష్టిని కలిగిస్తున్న ఈ పృథివి, మేఘాలు ఆహారపానీయాలనిచ్చి నన్ను చక్కగా తడుపునుగాక! బృహస్పతి-ఈ సూర్య కుటుంబంలో పాలించుచున్న సూర్యుడు నన్ను చక్కగా తడుపునుగాక! అట్లే అగ్ని-వైశ్వానరాగ్ని నన్ను సంతానంతోను, వారిని పోషించగల ధనంతోను చక్కగా తడుపునుగాక! నా ఆయువును దీర్ఘం చేయును గాక!

వివరణ: ఇక్కడ గాలి, భూమి, సూర్యుడు అగ్ని మనను తడపటమంటే వాటితో మన శరీరాలు చక్కగా పోషింపబడి జీవిస్తున్నాయని గ్రహించాలి.

గమనిక : ఈ క్రింది మంత్రాలు అథర్వవేదం యొక్క పైప్పలాద శాఖలోనివి. కాండం 6, సూక్తం 18లోని 2,3,5,6,7,8,9 మంత్రాలు. ఇవి సార్వదేశిక సభ ప్రచురించిన అథర్వవేదంలో ఉండవు. ఇవి శాఖా గ్రంథంలోనివికదా!

**2. ఓం సం మా సించంత్వాదిత్యాః సం మా సించం త్వగ్నయః ।**
**ఇంద్రః సమస్మాన్ సించంతు ప్రజయా చ ధనేన చ దీర్ఘమాయుః కృణోతు మే స్వాహా ॥**

సరళార్థం : ద్వాదశాదిత్యులు (అంటే-12 నెలలో 12 రకాలుగా భాసించే సూర్యకిరణాలు) వివిధ అగ్నులు, ఇంద్రుడు (విద్యుత్తు) నన్ను చక్కగా ఉత్తమ సంతానంతోను, పుష్కల ధనంతోను సించంతు-తడుపును గాక!

గమనిక : ఈ క్రింది మంత్రాలన్నిటిలోను పై మంత్రంలోని చివరి రెండు వాక్యాలు మరల మరల వస్తాయి. కనుక పైన గీటుగీసిన (Underline చేసిన) వాక్యాలను ఈ క్రింది సరళార్థాలలో చుక్కలు పెట్టినచోట చదువుకోవాలి.

**3. ఓం సం మా సించన్త్వరుషః, సమర్కా ఋషయశ్చ యే ।**
**పూషా సమస్మాన్ సించంతు ప్రజయా చ ధనేన చ దీర్ఘమాయుః కృణోతు మే స్వాహా ॥**

సరళార్థం : శమ దమాది సద్గుణ సంపన్న పూజనీయ ఋషులు, మమ్ము పాలించు రాజు నన్ను చక్కగా .............

**4. ఓం సం మా సించంతు పృథివీ, సం మా సించంతు యా దిశః ।**
**అంతరిక్షం సమస్మాన్ సించతు ప్రజయాచ ధనేన చ దీర్ఘమాయుః కృణోతు మే స్వాహా ॥**

సరళార్థం : పృథివీ ద్యులోక అంతరిక్షాలలో ఉండే ప్రాకృతిక దేవతలన్నియు నన్ను చక్కగా................

**5. ఓం సం మా సించంతు ప్రదిశః, సం మా సించంతు యా దిశః ।**
**ఆశాః సమస్మాన్ సించతు ప్రజయా చ ధనేన చ దీర్ఘమాయుః కృణోతు మే స్వాహా ॥**

సరళార్థం : దిశలు, ప్రదిశలు (మూలలు), అన్ని వైపులు నన్ను చక్కగా..........

**6. ఓం సం మా సించంతు కృష్టయః, సం మా సించంత్వోషధీః।**

**సోమః సమస్మాన్ సించంతు ప్రజయా చ ధనేన చ దీర్ఘమాయుః కృణోతు మే స్వాహా ॥**

<u>సరళార్థం</u> : (కృష్టయః) పొలాలు, ఓషధులు, సోముడు (చంద్రుడు) నన్ను చక్కగా........

**7. ఓం సం మా సించంతు నద్యః, సం మా సించంతు సింధవః।**

**సముద్రః సమస్మాన్ సించంతు ప్రజయా చ ధనేన చ దీర్ఘమాయుః కృణోతు మే స్వాహా ॥**

<u>సరళార్థం</u> : నదులు, వాగులు వంకలు, సముద్రాలు నన్ను చక్కగా........

**8. ఓం సం మా సించత్వాపః సం మా సించంతు కృష్టయః ।**

**సత్యం సమస్మాన్ సించతు ప్రజయా చ ధనేన చ దీర్ఘమాయుః కృణోతు మే స్వాహా ॥**

<u>సరళార్థం</u> : వాపీకూపతటాకాది సమస్త నీటివనరులు, రైతులు, సత్యము (ప్రకృతి) నన్ను చక్కగా తడుపును గాక – నా శరీరావయవాలకు కావలసిన అవసరాలను తీర్చునుగాక!

<u>వివరణ</u> : పై పిప్పలాద మహర్షికృత మంత్రాలు ఏమి బోధిస్తున్నాయంటే–మన దీర్ఘాయువునకు పరమపిత పరమేశ్వరుని అనుగ్రహంతో బాటు పరమమాత ప్రకృతి యొక్క సహకారం కూడా అవసరమే నంటున్నాయి. సృష్టిలోని పంచభూతాల, సూర్య, చంద్ర నక్షత్రాల, నీటి వనరుల, రైతుల, రాజుల సహకారం కూడా అవసరమేనంటున్నాయి.

వేదాలయొక్క శాఖా గ్రంథాలను గురించి కొందరి విద్వాంసుల అభిప్రాయమేమంటే–కొందరు ప్రాచీన ఋషులు వేదాలనుండి వారి వారి అభిరుచులను బట్టి కొన్ని విద్యలను, విషయాలను తెలిపే కొన్ని వేదమంత్రాలను గ్రహించి వాటికి వారి ఆలోచనలను జోడించి ఏర్పరుచుకున్న మంత్ర పాఠాలంటారు. ఒక రకంగా అవి వారు ఏర్పరచుకొన్న పాఠ్యగ్రంథాలు. వాటిని వారి శిష్యులకు బోధించేవారు. క్రమంగా అవే శాఖా గ్రంథాలుగా ప్రాచుర్యాన్ని పొందాయంటారు. కనుక వేదాలతో బాటు ఋషుల శాఖా గ్రంథాలను కూడా పరిశీలిస్తూ ఉండాలి. అవసరమైన వాటిని

గ్రహించి వాటికి అధునిక విజ్ఞానాన్ని కూడా కలిపి ఆలోచిస్తే మరెన్నో క్రొత్త ఆవిష్కారాలను చెయ్యగలుగుతాము. ముందు తరాలకు మరెంతో మేలు చెయ్యగలుగుతాము.

దీర్ఘాయువును కోరేవారు అందుకు తగిన గట్టి ప్రయత్నమే చెయ్యవలసి ఉంటుంది. కేవలం ప్రార్థించినంత మాత్రాన దీర్ఘాయువు లభించదు. మనం నవ నాగరికతలో పడి కొట్టుకుపోకుండా వీలైనంత ఎక్కువగా ప్రకృతితో సాన్నిహిత్యం చెయ్యాలి. స్వాభావిక శుద్ధ సాత్వికాహారాన్నే తీసుకోవాలి. మద్యమాంసాలను పూర్తిగా విడిచి పెట్టాలి. తగిన వ్యాయామ ప్రాణాయామాదులు చెయ్యాలి. మనస్సును రాగద్వేష రహితంగా, ప్రసన్నంగా ఉంచుకోవాలి. ఆత్మజ్ఞానాన్ని అలవర్చుకొని శీతోష్ణాలను, సుఖదుఃఖాలను, మానావమానాలను సహించాలి. ఇంద్రియ నిగ్రహం అలవరచుకోవాలి. పరమాత్మను గురించి, మానవ ధర్మాలను గురించి తెలుసుకుంటూ ఆదర్శజీవితం గడపాలి. అప్పుడే దీర్ఘాయువు లభిస్తుంది. అస్తు-మనం అట్లే చేయుదుము గాక!

## యజ్ఞ సమాప్తి-పూర్ణాహుతి

***సామాన్యంగా జన్మదినం నాడు ఈ విశేషహోమాలు సరిపోతాయి. 80 సంవత్సాలు పైబడిన వృద్ధుల కొరకు, ఏవైనా దీర్ఘరోగాలతో బాధపడుచున్న వారి కొరకు పండిత మదన మోహన విద్యాసాగర్ గారు "ఆయుష్కామ పద్ధతి" అనే పేరుతో వారి "సంస్కార సముచ్చయం" గ్రంథలో విధివిధానాలు వ్రాశారు. అట్టివారు దానినికూడా అనుసరించవచ్చును. దానిని ఈ పుస్తకం చివర అనుబంధంగా చేర్చాము.***

ఇంతవరకు బృహత్ యజ్ఞవిధి+విశేషహోమాలు కలిసి చాలా సేపు యజ్ఞం చేశాము. కనుక మరొకసారి స్విష్టకృతి ఆహుతి ఇవ్వటం మంచిది. "**యదస్య కర్మణోఽ త్యరీరిచమ్**" అనే మంత్రంతో ఘృతంతోబాటు కొద్ది తీపి పదార్థాన్ని ఆహుతిగా యివ్వాలి. అనంతరం ఘృతంతో మనస్సులోనే "**ఓం ప్రజాపతయే స్వాహా**" అనుకొని ఒక నేతి ఆహుతి ఇవ్వాలి. దీనిని "**ప్రాయశ్చిత్తాహుతి**" అనికూడా అంటారు. యజ్ఞంలో జరిగిన లోటుపాట్లు సవరింపబడి ఆ హోమ వాయువులు ప్రాణులన్నిటికి మేలు చేసేవిగా చేయుమని పరమేశ్వరుని ప్రార్థిస్తారు. చివరిగా "**సర్వం వై పూర్ణం స్వాహా**" అంటూ 3 పర్యాయాలు గిన్నెలో మిగిలిన నేతినంతా ఆహుతిగా యివ్వాలి. అనంతరం బృహత్ యజ్ఞవిధిలోని యజ్ఞప్రార్థన, భజన చేసుకోవాలి. విద్వాంసులు, పెద్దలు

ఎవరైనా విచ్చేసి ఉంటే వారిచే ఆశీర్వచన పూర్వక ఉపదేశాలు ఇప్పించాలి. అనంతరం ఈ క్రింది వేదమంత్రాలతోను, వచనాలతోను పెద్దలు, బంధుమిత్రులు ఆశీస్సులు పలకాలి.

## ఆశీర్వాదములు

యజ్ఞానంతరం యజమానికి (యజ్ఞకర్తకు) ఆశీర్వాదం చెప్పటం సనాతన సంప్రదాయం. అవి ముందుగా ఈశ్వరీయ జ్ఞానమైన వేదమంత్రాలతో చెబితేనే అర్థవంతంగా శ్రేష్ఠంగా ఉంటాయి. అనంతరం సందర్భోచితంగా మనం కొన్ని సంస్కృత వాక్యాలతో ఆశీస్సులు పలుకవచ్చు. ఈ జన్మదిన వేడుకకు అనుగుణంగా ఉండే కొన్ని వేదమంత్రాలను, వాక్యాలను ఇక్కడ తెలుపుచున్నాము. అందులో పురోహితులు కొన్ని మార్పులు, చేర్పులు చేసుకోవచ్చు. సమయాన్ని, యజ్ఞకర్తల శ్రద్ధను గమనించి ఏవేని 1,2 మంత్రాలు పలికించవచ్చు.

## బాల-బాలికలకు ఆశీర్వాదం

**1. ఓం శతం జీవ శరదో వర్ధమానః శతం హేమన్తాన్ శతం వసన్తాన్ ।**
**శతం ఇంద్రాగ్నీ సవితా బృహస్పతిః శతాయుషా హవిషేమం పునర్దుః॥**

– ఋగ్వేదం (10-161-4)

సరళార్థం : హే బాలకా! లేదా (హే బాలికా!) సర్వవ్యాపక సర్వేశ్వరుని అనుగ్రహం వల్ల నీవు నూరు శరద్ఋతువులు, నూరు హేమంతఋతవులు, నూరు వసంతాలు అన్ని విషయాలలోను (శారీరకంగా, మానసికంగా, బౌద్ధికంగా, సామాజికంగా, ఆత్మికంగా) వర్ధిల్లుతూ జీవింతువు గాక! ఇంద్రుడు, అగ్ని, సవితా, బృహస్పతి మొదలగు పెక్కు నామములతో పిలువబడు ఏకేశ్వరుడు నీవు నూరు సంవత్సరాలు సుఖంగా జీవించుటకు కావలసిన భోగ భాగ్యాలను ప్రసాదించునుగాక! శతాయువును మరల మరల ప్రసాదించును గాక!

**2. ఓం సాగ్రం వర్షశతం జీవ పిబ ఖాద చ మోద చ।**
**ఆయుర్బలం యశః ప్రజ్ఞాం ప్రాప్నుయాః శుభ సంపదామ్॥**

– ఋగ్వేద ఖిలాభాగం (4-7-7 యొక్క పూర్వార్థం)

**3. ఓం ఏహ్యాశ్మానమా తిష్ఠాశ్మా భవతు తే తనుః ।**
**కృణ్వన్తు విశ్వే దేవా ఆయుష్టే శరదః శతమ్ ॥**

– అథర్వవేదం (2-13-4)

సరళార్థం : ఓ బాలకా! (ఓ బాలికా!) నీవు నూరు వత్సరాలు చక్కగా దుగ్ధాదులను పానం చేస్తూ, స్వాదిష్ట పదార్థాలను తింటూ ఆనందంగా జీవింతువుగాక! ఆరోగ్యమైన ఆయువును, బలమును, కీర్తిని, విశిష్టజ్ఞానాన్ని శుభసంపదలను పొందుదువు గాక! సమస్త దేవతలు నీకు శతశరత్తుల ఆయువునిత్తురు గాక.

### సరళ సంక్షిప్త సంస్కృత వచనాలు

**హే బాలక! వేద ప్రియ!* త్వం జీవ శరదః శతం వర్ధమానః, ఆయుష్మాన్, వర్చస్వీ, తేజస్వీ, యశస్వీ, విద్యావాన్, సద్గుణవాన్, సౌశీల్యవాన్, సౌభాగ్యవాన్ భూయాః।**

**హే బాలికే! సుమతే!* త్వం జీవ శరదః శతం వర్ధమానా, ఆయుష్మతీ, వర్చస్వినీ, తేజస్వినీ, యశస్వినీ, విద్యావతీ, సద్గుణవతీ, సౌశీల్యవతీ, సౌభాగ్యవతీ భూయాః।**

(*) జన్మదినం జరుపుకునే బాలబాలికల పేర్లు ఉచ్చరించాలి.

### పెద్దలకు ఆశీర్వాదాలు

ముందుగా యజ్ఞకర్తతో ఈ క్రింది మంత్రంతో ఉపస్థానం (ప్రార్థన) చేయించాలి.

**ఓం జాతవేదో యశో అస్మాసు దేహి ప్రజాభిరగ్న అమృతత్వమశ్యాః ।**
**యస్మైత్వం సుకృతే జాతవేద ఉ లోకమగ్నే కృణ్వః స్యోనమ్ ॥**

సరళార్థం : హే సర్వపదార్థ జ్ఞాతా! ప్రభో! మాకు యశస్సు నిమ్ము. నీ అనుగ్రహం వల్ల మేము ఉత్తమ సంతానమును, పూర్ణాయువును పొందుదుముగాక! ఓ దేవా! నీచే రచింపబడిన ఈ విశ్వము సుఖపూర్ణము. అట్టి సుఖమును మాకును ప్రసాదింపుము.

అనంతరం పురోహితులు, విద్వాంసులు, పెద్దలు, బంధు మిత్రులు ఈ క్రింది మంత్రాలతో ఆశీర్వచనాలు పలకాలి.

**1. ఓం ఇంద్ర శ్రేష్ఠాని ద్రవిణాని ధేహి, చిత్తిం దక్షస్య సుభగత్వ మస్మే।**
**పోషం రయీణాం, అరిష్టిం తనూనాం, స్వాద్మానం వాచః, సుదినత్వమహ్నామ్।**

- ఋగ్వేదం (2-21-6)

సరళార్థం : హే ఇంద్ర! సర్వైశ్వర్య ప్రదాత! ఈ యజ్ఞకర్తకు శ్రేష్ఠమైన (న్యాయార్జితమైన) ధనమును పుష్కలంగ ప్రసాదింపుము. దక్షతగల చిత్తమును, సౌభాగ్యమును-దానితో పుష్టి తుష్టులను, నిరోగమైన శరీరాన్ని, వాక్కులో మధురతను ప్రసాదింపుము. ప్రతి దినము శుభదిన మగునట్లు అనుగ్రహింపుము.

**2. ఓం ధ్రువాసి ధ్రువో౽యం యజమానో౽స్మిన్నాయతనే ప్రజయా పశుభిర్భూయాత్।**
**ఘృతేన ద్యావాపృథివీ పూర్యేథామిన్ద్రస్య ఛదిరసి విశ్వజనస్య ఛాయా ॥**

- యజుర్వేదం (5-28)

సరళార్థం : ఓ యజ్ఞమొనర్చు దంపతులారా! ఇక్కడ మీరిరువురు దృఢంగా కూర్చొని ఉన్నట్లే గృహస్థాశ్రమమున విధి నిషేధాలను పాటిస్తూ స్థిరంగా ఉండండి. ఉత్తమ సంతానంతోను, గో అశ్వాది సంపదలతోను వర్ధిల్లండి. తరచుగా యజ్ఞయాగాదులు చేస్తూ ఘృతయుక్త యజ్ఞ వాయువుతో ద్యులోక పృథివీ లోకాలను పూరించండి. పరమైశ్వర్యశాలియైన ఇంద్రుని-పరమేశ్వరుని అనుగ్రహం మీకు ప్రాప్తించును గాక! విశ్వజనుల సహకారం మీకు లభించును గాక!

ఒకవేళ సమయం సరిపోకుంటే సంక్షిప్తంగా ఈ క్రింది సంస్కృత వాక్యాలతో ఆశీస్సులు పలకవచ్చు.

1. **సత్యాః సంతు యజమానస్య కామాః !**
2. **సఫలాః సంతు యజమానస్య కామాః !**
3. **భద్రాః సంతు యజమానస్య కామాః !**
4. **పూర్ణాః సంతు యజమానస్య కామాః !**

## సత్కారాలు -దానాలు

అనంతరం పురోహితులను, విద్వాంసులను, మహాత్ములను తగిన విధంగా సత్కరించాలి. ధార్మిక సంస్థలకు, గురుకులాలకు, సమాజాలకు, అనాథాలయాలకు యథాశక్తి 1,2 సంస్థలకు దానం చేయటం మంచిది. మహర్షు లేమన్నారంటే-

శ్లో॥ శ్లోకార్థేన ప్రవక్ష్యామి యదుక్త గ్రంథ కోటిభిః
పరోపకారః పుణ్యాయ, పాపాయ పరపీడనమ్ ॥ (మహాభారతం)

ఓ మనవులారా! కోటి గ్రంథాల సారాంశం మేము ఒక అర్ధశ్లోకంలో చెబుతున్నాము. అదేమిటంటే-పుణ్యం కావాలనుకుంటే వీలైనంత ఎక్కువగా పరోపకారం చేయండి. పాపం కావాలనుకుంటే పరులను పీడించండి" అన్నారు.

పూజలు వ్రతాలు, దీక్షలు, తపస్సులు, తీర్థయాత్రలు మొదలైనవన్నీ ఒక నమ్మకంతో చేస్తున్నవే కాని పుణ్యాన్ని యివ్వలేవు. పుణ్యాన్ని పొందటానికి, ఇహ పరలోకాలలో ఉన్నతిని పొందటానికి పరోపకారం చేయటమే సరైన మార్గం. పుణ్యంవల్ల మనకు సుఖాలు లభిస్తాయి. పాపం చేస్తే ఎప్పటికైనా కష్టాలు తప్పవు. అవి అనుభవిస్తే కాని పోవు.

## అభివాదాలు-శాంతిపాఠం

యజ్ఞానంతరం ముందుగా తల్లిదండ్రులకు, విద్యలు నేర్పిన గురువులకు, సత్యోపదేశకులైన సాధుమహాత్ములకు, విద్వాంసులకు పాదాభివందనం చేయాలి. దీనినే-"మాతృదేవో భవ, పితృదేవో భవ, ఆచార్యదేవో భవ, అతిథిదేవో భవ" అంటాయి శాస్త్రాలు. అనంతరం బంధుమిత్రులకు ఆహ్వానితులకు నమస్కరించాలి, వైదిక శాంతిపాఠంతో జన్మదిన విశేష యజ్ఞాన్ని ముగించాలి. ఆహ్వానితులకు యథాశక్తి ఆతిథ్యం యిచ్చి వీడ్కోలు పలకాలి.



యజ్ఞోవై శ్రేష్ఠతమం కర్మ

- యాజ్ఞవల్క్య మహర్షి
(శతపథ బ్రాహ్మణం)

## ముగింపు మాటలు (CONCLUSION)

**ప్రియ పాఠకులారా!**

మీరింతవరకు చదివిన పద్ధతిలో జన్మదినం జరుపుకోవటం ఉత్తమమైన పద్ధతి. ఈ విధంగా జరుపుకుంటే జీవితలక్ష్యం ఏమిటో బోధపడుతుంది. వేదాల వెలుగులో మన ప్రాచీన ఋషులు ఆలోచించి మానవ జీవిత లక్ష్యం-"ధర్మార్థ కామ మోక్షాలను" సాధించటమన్నారు. ఈ చతుర్విధ పురుషార్థాలను మాటిమాటికి స్మరించు కోవాలన్నారు. నిత్యం ఉదయం కాలకృత్యస్నానాదుల అనంతరం విధిగా సంధ్యావందనం చేయాలాన్నారు. గాయత్రీజపం, ఓం కార ధ్యానం వీలైనంత ఎక్కువ సమయం చెయ్యాలన్నారు. ఆ జపధ్యానాల అనంతరం-

"హే జగదీశ్వర! దయానిధే! భవత్ కృపయా అనేన జప ఉపాసనాది కర్మణా ధర్మార్థ కామ మోక్షాణాం సద్య సిద్ధిః భవేత్+నః" అని సంకల్పించుకోవాలన్నారు. సాయంత్రం కూడా వీలు చేసుకొని సంధ్యావందనం చేసి పై విధంగా సంకల్పించుకోవాలన్నారు. అరుదుగా లభించే మానవ జన్మను సార్థకం చేసుకోండని" హితవు పలికారు.

మహర్షి దయానంద సరస్వతీ స్వామివారు "ధర్మమంటే-సత్యన్యాయ ఆచరణ మనీ, అర్థమంటే-ధర్మ పూర్వకంగా లభించే సుఖ భోగ్య పదార్థాలనీ, కామమంటే ధర్మ, అర్థాలతో లభించే పదార్థాలను భోగించే భాగ్యమనీ, మోక్షమంటే సమస్త దుః ఖాల నుండి విముక్తిని పొంది పరమేశ్వరుని తృతీయధామంలో స్వేచ్ఛగా విహరిస్తూ దేవునినుండి సదా ఆనందాన్ని, జ్ఞానాన్ని పొందటమనీ" వివరించారు. అర్థకామములు కూడా మనకు అభ్యుదయ నిఃశ్రేయసాలను కలిగించాలి కాని అధోగతిని కలిగించేటట్లు చేయకూడదు. నిఃశ్రేయసమే (ముక్తియే) పరమ పురుషార్థం కావాలి. వివరాలకు మా ప్రచురణ "సంధ్యావందనము వైజ్ఞానిక సమాలోచనము" పుస్తకంలో చూడగోరుచూ ఈ చిన్న గ్రంథాన్ని యింతటితో ముగిస్తున్నాను.

**' ఆ నో భద్రాః క్రతవో యంతు విశ్వతః'** -(యజుర్వేదం 22-2)

మాకు అన్ని వైపుల నుండి భద్రమైన ఆలోచనలే వచ్చునుగాక!

ఓ3మ్ స్వస్తి స్వస్తి స్వస్తి.

**అనుబంధం (Appendix)**

# విశేష ఆయుష్కామ యజ్ఞం

(చాలా వృద్ధుల కొరకు, ఏవైనా దీర్ఘరోగాలతో బాధపడుచున్నవారి కొరకు)

పూర్వం రామాయణకాలంలో-రఘువంశ మహారాజుల పరిపాలన కాలంలో చతురాశ్రమ వ్యవస్థ చాలా చక్కగా జరుగుతూ ఉండేది. అందుకు ఈ క్రింది "రఘువంశ కావ్యం"లోని శ్లోకమే ప్రమాణం.

**శ్లో॥ శైశవే అభ్యస్త విద్యానాం, యౌవ్వనే విషయైషిణామ్ ।**
**వార్ధక్యే మునివృత్తీనాం, యోగేనాన్తే తనుత్యజామ్ ॥**

– రఘువంశ కావ్యం (కాళిదాస విరచితం)

ఆ నాటి బాలబాలికలు వేరువేరు గురుకులాలో చేరి అచటి నియమాలన్నీ పాటిస్తూ వేదాది సత్యశాస్త్రాలు అభ్యసించేవారు. చక్కటి యవ్వనం ప్రాప్తించిన అనంతరం తమ విద్యా రూప లావణ్యాలకు తగిన కన్యలను వివాహమాడి గృహస్థాశ్రమంలో ప్రవేశించి ధర్మపూర్వకమైన లౌకిక సుఖాల ననుభవించేవారు. వార్ధక్యం ప్రాప్తించిన వెంటనే (మనుమలు కలిగిన తదుపరి) వానప్రస్థులై మునివృత్తిలో-స్వాధ్యాయ జపధ్యాన నిష్ఠాదులతో సంయమ జీవితం గడిపేవారు. జీవితపు చివరి దశలో యోగారూఢులై సర్వవ్యాపక సచ్చిదానంద సర్వేశ్వరుని ధ్యానిస్తూ జన్మరాహిత్యాన్ని – ముక్తిని కోరుతూ శరీరాన్ని వదిలి పెట్టేవారు.

అట్టి ఆశ్రమ పరంపర మహాభారత కాలంవరకు కొనసాగింది. మహా భారత యుద్ధానంతరం ధర్మరాజును పట్టాభిషక్తుని చేసి ధృతరాష్ట్రుడు, గాంధారి, కుంతీదేవి, విదురుడు మరికొంతమంది వనాలకు వెళ్లి, తాపసిక జీవనం గడిపినట్లు మహాభారత ఆశ్రమపర్వంలో స్పష్టంగా వ్రాసి ఉంది. ప్రమాదవశాత్తు అడవిచుట్టూ నిప్పు అంటుకొనగా ధృతరాష్ట్ర గాంధారీ కుంతీ దేవులు యోగారూఢులై తమ దేహాలను అగ్నికి అర్పించినట్లుగా ఆ గ్రంథంలో ఉంది.

కాని నేటి దేశకాల పరిస్థితులు అందుకు అనువుగా లేవు. విదేశీయుల పాలన కాలంలో మన ఆశ్రమ వ్యవస్థ అస్తవ్యస్థమయ్యింది. దానికితోడు నవనాగరికత

పేరుతో అనుసరిస్తున్న మన ఆహార విహార ఆచారాలన్నీ మనను రోగాల పాలు చేస్తున్నాయి. షుగరు, బి.పి, కొలెస్ట్రాల్ వంటివి వృద్ధులను బాధిస్తున్నాయి. ఆహారఖర్చులకన్నా మందులఖర్చులే ఎక్కువయ్యాయి.

అందుచే వానప్రస్థాశ్రమం నామమాత్రంగా మిగిలిపోయింది. ఈ పరిస్థితులలో వృద్ధులు గృహాలలోనే ఉంటూ దైవప్రార్థనలో గడుపుతున్నారు. అటువంటి వృద్ధులు తమ జన్మదినంనాడు వార్ధాపనవిధితో బాటు విశేషంగా ఆరోగ్యం కొరకు, దీర్ఘాయువు కొరకు విశేషహోమం చేసుకోగోరుచున్నారు. అందుకొరకు కీ.శే. పం. మదన మోహన విద్యాసాగర్ గారు తమ "సంస్కార సముచ్చయ" గ్రంథంలో 'ఆయుష్కామ పద్ధతి' అనే పేరుతో ఒక ఉపసంస్కారంగా వ్రాశారు. దానిని మేము స్వేచ్ఛానువాదం చేసి ఈ అనుబంధంలో ప్రచురిస్తున్నాము.

పం. మదనమోహన విద్యాసాగర్ గారు పంజాబులోని ఒక ఆర్య పరివారంలో జన్మించారు. స్వామి శ్రద్ధానందుల వారు స్థాపించిన కాంగడీ ఆర్షగురుకులంలో చేరి "విద్యాసాగర్" ఉపాధి వరకు చదువుకున్నారు. అనంతరం సార్వదేశిక ఆర్యప్రతినిధి సభలో ప్రచారకులుగా చేరి హైదరాబాదు సంస్థానంలోని హైదరాబాదు నగరానికి ప్రచారం చెయ్యటానికి వచ్చారు. ఈ ప్రాంతం వారికి నచ్చింది. క్రమంగా నారాయణగూడా మెయిన్ రోడ్డులో ఒక ఇల్లు కొనుక్కొని ఇక్కడ స్థిరపడి, కొద్దిగా తెలుగు నేర్చుకొని ఈ ప్రాంతంలో చక్కగా ప్రచారం చేశారు. మా గురుదేవులు పం. గోపదేవ్ శాస్త్రి గారికి మంచి మిత్రులయ్యారు. తెనాలి ప్రాంతంలో కూడా ప్రచారం చేశారు. మా సీతాఫలమండి ఆర్యసమాజంలో సభ్యులై సమాజ అధ్యక్షులు కూడానై, మమ్మందరిని ప్రోత్సహిస్తూ తమ సేవలందించారు. నేను హోమియో వైద్యునిగా, ప్రచారకునిగా, పురోహితునిగా, రచయితగా ఎదగటానికి వారి ప్రోత్సాహ సహకారాలు కూడా ఒక కారణం. అట్టి మహానుభావునకు కృతజ్ఞతో శ్రద్ధాంజలి ఘటిస్తూ. ఈ ఆయుష్కామ పద్ధతిని నా శక్తి కొలది సరళంగా తెలిపే ప్రయత్నం చేస్తాను.

**విశేష ఆయుష్కామ యజ్ఞం (చాలా వృద్ధులకొరకు, దీర్ఘరోగుల కొరకు విశేషహోమం).**

వృద్ధుల జన్మదినంనాడు గాని, లేదా మరొక అనుకూలదినంనాడు గాని "ఈ యజ్ఞం ఏర్పాటు చేసుకోవచ్చు. వృద్ధులు రెండు రకాలుగా ఉంటారు. కొందరు యజ్ఞ వేదికవద్ద కూర్చొని స్వయంగా ఆహుతు లివ్వగలవారు. అట్టివారు ఆ విధంగానే చెయ్యాలి. మరి కొందరు దురదృష్టవశాత్తు పక్షవాతంతో గాని, మరేదైనా దీర్ఘవ్యాధితో గాని మంచానికే పరిమితమైపోయినవారు. అట్టి వారికి వారి పక్షంలో వారి కుటుంబ సభ్యులెవరైనా యజ్ఞం వద్ద కూర్చొని ఆహుతులివ్వవచ్చును. వృద్ధుల ఆరోగ్యం కొరకు, దీర్ఘాయువు కొరకు ప్రార్థనలు చేయవచ్చును.

ముందుగా సంకల్ప, ఆచమన, పరమేశ్వర స్తుతి ప్రార్థనోపాసనలు, స్వస్తివాచన, శాంతి కరణములు పఠించవలెను. అనంతరం బృహత్ యజ్ఞ-విధిని పూర్తిచేసి ఈ విశేష ఆయుష్కామహోమాన్ని ప్రారంభించాలి.

## పరమేశ్వర ఉపస్థానము (అంతర్యామి ఉపాసన)

**1. ఓం త్ర్యంబకం యజామహే సుగన్ధిం పుష్టివర్ధనమ్ ।**
**ఉర్వారుకమివ బన్ధనాత్+మృత్యోర్ముక్షీయ మామృతాత్ ॥**

-ఋగ్వేదం (7-59-12)

ఓ త్ర్యంబకేశ్వరా! త్రిలోకాధిపతీ! త్రికాలజ్ఞానీ! నిన్ను మేము సదా స్మరింతుముగాక! పూజింతుము గాక! సుగంధితము పుష్టివర్ధకమునైన దోసపండు తీగనుండి సునాయసంగా (తేలికగా) విడిపోవునట్లు నీవు మమ్ము అకాలమృత్యువునుండి, కష్టాల నుండి విడిపించుము. కానీ, నీ అమరత్వ ధామాన్నుండి వేరుచెయ్యవద్దు.

**2. ఓం వివస్వాన్ నో అమృతత్వే దదాతు పరైతు మృత్యు రమృతం న ఏతు ।**
**ఇమాన్ రక్షతు పురుషానా జరిమ్ణో మో ష్వేషామసవోయమం గుః ॥**

- అథర్వవేదం (18-3-62)

ఓ వివస్వానుడా! ప్రకాశమయ పరమేశ్వరా! మాకు అమృతత్వాన్ని ప్రసాదించు,

మృత్యువుని పోగొట్టి అమృతాన్ని ప్రసాదించు-కష్టాలను బాధలను పోగొట్టి సుఖసంపదలను ప్రసాదించు, రోగాది బాధలనుండి విముక్తుల జేయుము. మృత్యుబాధనుండియు కాపాడుము.

అనంతరం ఘృత శాకల్యాలతో (నేయి, హోమద్రవ్యాలతో) ఆహుతులు

**1. ఓం వసంత ఇన్ను రంత్యో గ్రీష్మ ఇన్ను రంత్యః ।**
**వర్షాణ్యను శరదో హేమంతః శిశిర ఇన్ను రంత్య స్వాహా ॥**
- సామవేదం (616)

హే పరమేశ్వరా! నీ దివ్యమైన సృష్టిలోని వసంత ఋతువు రమణీయమైనది. గ్రీష్మ ఋతువును రమణీయమే-వాత శ్లేష్మ రోగులకు, కొన్ని ప్రాణులకు అది రమణీయమే కదా! సుఖము నిచ్చునదియే కదా! అట్లే, వర్ష శరద్ హేమంత శిశిర ఋతువులు కూడా రమణీయములే. వేటి ప్రత్యేకత వాటికున్నది. ప్రాణి మనుగడకు ఇవన్నియు అవసరమే. అట్టి ఋతుదేవతలకు స్వాహా-ఈ ఆహుతి నర్పిస్తున్నాను.

**2. ఓం పశ్యేమ శరదః శతం స్వాహా ।**

హే సర్వంతర్యామీ! ప్రాణదాతా! సర్వజీవన ప్రదాతా! నీ కృపవలన మరియు మా వివేకశీల జీవనం వలన మేము నూరు సంవత్సరములు చక్కగా చూతుముగాక! మంచివే చూతుముగాక!

**3. ఓం జీవేమ శరదః శతం స్వాహా ।**

నూరు శరత్తులు ఆరోగ్యముగా జీవింతుముగాక!

**4. ఓం బుధ్యేమ శరదః శతం స్వాహా ।**

శత శరత్తులు వివేకవంతులమై జీవింతుముగాక!

**5. ఓం రోహేమ శరదః శతం స్వాహా ।**

నూరు శరత్తులు ఉన్నతిని పొందుచు జీవింతుము గాక!

**6. ఓం పూషేమ శరదః శతం స్వాహా ।**

నూరు శరత్తులు పుష్టిగా బలంగా జీవింతుముగాక!

**7. ఓం భవేమ శరదః శతం స్వాహా ।**

నూరు సంవత్సరాలు ధనధాన్యాలతో దాన ధర్మాలు చేస్తూ జీవింతుము గాక!

**8. ఓం భూయేమ శరదః శతం స్వాహా ।**

నూరు సంవత్సరాలు సదాచార సచ్ఛీలతలతో జీవింతుముగాక!

**9. ఓం భూయసీః శరదః శతం స్వాహా ।**

శతాధిక వర్షాలవరకు కూడా ఆరోగ్యంగా ఆనందంగా జీవింతుముగాక!

**వివరణ :** పై చిన్న చిన్న మంత్రాలన్నీ అథర్వవేదంలోని 19వ కాండ 67వ సూక్తం లోనివి. వీటి భావమేమంటే-మనమంతా ఆరోగ్యనియమాలు పాటిస్తూ, యోగవ్యాయామ ప్రాణాయామాదులు చేస్తూ శరీరాన్ని, ఇంద్రియాలను బల పరచుకోవాలి. సంధ్యాగ్నిహోత్రాలు చేస్తూ మమ్ము సత్కర్మలలో ప్రేరేపిస్తూ ఉండమని అంతర్యామిని మనసారా ప్రార్థించుకోవాలి. అనంతరం పై విధంగా సంకల్పించుకుంటే తప్పక ఫలితముంటుంది. మన పూర్వులు ఆ విధంగా చేసి సాధించారు. మహాభారత యుద్ధంలోని సర్వసైన్యాధిపతులంతా నూరు సంవత్సరాలు పై బడినవారే.

## <u>పూర్ణాయువు కొరకు ఆహుతులు</u>

**1. ఓం జీవా స్థ జీవ్యాసం సర్వమాయుర్ జీవ్యాసం స్వాహా ।**

నేను దీర్ఘకాలం జీవించి పూర్ణ పురుషార్థం చేయుదునుగాక! "నేను జీవించియే ఉంటాను. సంపూర్ణ ఆయువును అనుభవిస్తాను" అని తరచుగా తలుచుకుంటూ ఉందునుగాక!

**2. ఓం ఉపజీవా స్థోప జీవ్యాసం సర్వమాయుర్ జీవ్యాసం స్వాహా ।**

విద్వాంసుల సాంగత్యంలో నేను దేవుడిచ్చిన ఆయువును మరింత పొడిగించు కొందునుగాక!

**3. ఓం సం జీవాస్థ సం జీవ్యాసం సర్వమాయుర్ జీవ్యాసం స్వాహా ।**

మేమంతా కలిసిమెలసి పూర్ణాయువును జీవింతుముగాక!

**4. ఓం జీవలా స్థ జీవ్యాసం సర్వమాయుర్ జీవ్యాసం స్వాహా ।**

ఇతరులను జీవింపచేస్తూ-వారికి శక్తి కొలది సాయం చేస్తూ సంపూర్ణ ఆయువును అనుభవింతుముగాక!

– అథర్వవేదం (19–69–1,2,3,4)

వివరణ : కేవలం మనమే మంచిగా జీవించాలనుకోవటమేగాక అందరితో కలిసి మెలసి వారి ఉన్నతికి కూడా మనం కృషి చెయ్యాలని ఈ మంత్రాలు బోధిస్తున్నాయి. అందుచేతనే మహర్షి దయానందులవారు తాము స్థాపించిన ఆర్యసమాజానికి దశనియమాలు ఏర్పరుస్తూ 9వ నియమంగా – "ప్రతి వ్యక్తియు తన ఉన్నతితోనే సంతృప్తి చెందక అందరి ఉన్నతిలోనే తన ఉన్నతి కలదని భావించాలి" అని అన్నారు.

**5. ఓం ఇన్ద్ర జీవ సూర్య జీవ దేవా జీవా జీవ్యాసమహమ్ ।**
**సర్వమాయుర్ జీవ్యాసం స్వాహా ॥**

– అథర్వవేదం (19–70–1)

ఓ పరమైశ్వర్య పరమాత్మా! నీ కృపవలన సూర్యుడు మరియు దేవగణములు –పృథివ్యాది పంచభూతములు నాకు సహకరించునుగాక! నేను పూర్ణాయువును అనుభవింతునుగాక!

## స్థాలీపాక + ఆహుతులు

స్థాలీ అంటే గిన్నె అని అర్థం. స్థాలీపాకము అంటే గిన్నెలో వండిన పాయసము, సీరా (హల్వా) మొదలైన తీపి పదార్థాలు. వాటిలో ఏదేని ఒక దానిని కొద్దిగా వేరే చిన్నగిన్నెలో తీసుకొని దానిలో 4 చెంచాల నెయ్యికలిపి ఈ క్రింది మంత్రాలతో 4 ఆహుతులివ్వాలి.

**1. ఓం ఉత్క్రామాతః పురుష మావ పత్థా మృత్యోః పడ్వీశమవముఞ్చమానః ।**
**మా చ్ఛిత్థా అస్మల్లోకాదగ్నేః సూర్యస్య సంధృశః స్వాహా ॥**

– అథర్వవేదం (8–1–4)

ఈ దేహపురంలో వసించు ఓ పురుషుడా! నీవు ఈ రోగాల నుండి, దేహాత్మభ్రాంతి యనెడి అజ్ఞానంనుండి పైకెగురు. మరల క్రింద పడవద్దు. నీవు మృత్యుపాశాల నుండి విడివడుతూ అగ్నివలె, సూర్యునివలె ప్రకాశించు. వాటి ఆదర్శాల నుండి విడిపోవద్దు.

**2. ఓం ఉద్యానం తే పురుష నావయానం, జీవాతుం తే దక్షతాతిం కృణోమి ।**
**ఆ హి రోహేమే మమృతం సుఖం రథ మథ జిర్వ్రిర్విదథమా వదాసి స్వాహా॥**

– అథర్వవేదం (8–1–6)

ఓ మానవా! ఉత్తమ కర్మల నాచరించి ఉన్నతిని పొందుము, అధమకర్మల నాచరించి అవనతిని పొందవద్దు. నేను నీకు జీవితాన్ని, దక్షతను ప్రసాదిస్తున్నాను. ఈ ఉత్తమ సుఖకారక మానవ శరీర రథాన్ని అధిరోహించి అమరత్వాన్ని పొందు. యజ్ఞమయ జీవితంతో వృద్ధుడవై నీ అనుభవాలను తోటి మానవుల కందించి ఆదర్శపురుషుడవు కమ్ము.

**3. ఓం శతమిన్ను శరదో అంతిదేవా యత్రా నశ్చక్రా జరసం తనూనామ్ ।**
**పుత్రాసో యత్ర పితరో భవన్తి మా నో మధ్యారీరిషతాయుర్గంతోః స్వాహా॥**

– యజు. (25–22)

హేపరమేశ్వరా! వేద విద్వాంసుల సాంగత్యంతో, మార్గదర్శనంతో మేము కనీసం 100 సంవత్సరాలైనా జీవింతుము గాక! మా పుత్రులకు పుత్రులు కలుగువరకు ఆరోగ్యంగా జీవింతుముగాక! దయచేసి మధ్యలోనే మా ఆయువును పోగొట్టవద్దు.

**4. ఓం మా బిభేర్న మరిష్యసి జరదష్టిం కృణోమి త్వా ।**
**అయం లోకః ప్రియతమో దేవానామపరాజితః ।**
**స చ త్వాను హ్వాయమసి మాపురా జరసో మృదాః స్వాహా ॥**

– అథర్వ (5–30–817)

ఓ మానవా! నీవు భయపడవద్దు. నీవు చనిపోవు. నిన్ను నేను శతాధిక

వర్షముల ఆయువును పొంద సమర్థుని చేయుచున్నాను. ఈ ఉత్తమ మానవ శరీరం సర్వప్రాకృతిక దేవతల నిలయం. నీవు ఎప్పుడును పరాజితుడవు కావు. వృద్ధావస్థ వరకు జీవించియే ఉండుము. మధ్యలో మరణించవద్దు.

**5. ఓం ఆయుషాయుః కృతాం జీవాయుష్మాన్ జీవ మా మృథాః ।**
**ప్రాణేనాత్మన్వతాం జీవమా మృత్యోరుదగా వశం స్వాహా ॥**

– అథర్వ (19–27–8)

ఓ మానవా! దీర్ఘాయువుగలవారి సాంగత్యంలో నీవు జీవించు. ఉత్తమ మానవుల సాంగత్యంలో జీవించు. ప్రాణాయామం చేయుచుండు వారి సాంగత్యంలో జీవించు. మరణించే ప్రయత్నం చెయ్యవద్దు.

<u>మరొకసారి ఉపస్థానం (ఉపాసన)</u>

**1. ఓం వర్చ ఆ ధేహి మే తన్వాం సహ ఓజో వయో బలమ్ ।**
**ఇంద్రియాయ త్వా కర్మణే వీర్యాయ ప్రతిగృహ్ణామి శత శారదాయ ॥**

– అథర్వ (19–37–2)

హే అంతర్యామిన్ పరమేశ్వరా! నా శరీరంలో ఓజస్సు–పరాక్రమము, వయ–పౌరుషము, బలము, వీరతలను నింపుము. వాటితో నేను నూరు శరత్తులను చూచు భాగ్యాన్ని నాకు ప్రసాదించుము.

**2. ఓం అహమింద్రో న పరా జిగ్య, ఇద్ధనం న మృత్యవే అవతస్థే కదాచన ।**

– ఋగ్వేదము (10–48–5)

నేను ఇంద్రుడను. ఇంద్రియాధిపతిని – జీవుడను. నాకెప్పుడును పరాజయం కలుగదు. నా ధనములను ఎవరూ నష్టపరచలేరు. మృత్యువు నన్ను కబలించలేదు. నేను అనాది స్వరూపుడను. సర్వాంతర్యామిచే వ్యాప్తుడనై ఉన్నాను.

<u>యజ్ఞ ముగింపు</u> : అనంతరం ప్రాతః సాయంకాల ఆహుతులిచ్చి '**సర్వం వై పూర్ణం స్వాహా**' అనే మంత్రం పఠిస్తూ 3 పూర్ణాహుతులను ఇవ్వాలి. తదుపరి యజ్ఞానంతర ప్రార్థనలు చెయ్యాలి. యజ్ఞ భజనకూడ పాడుకోవాలి. అనంతరం విద్వాంసుల ప్రవచనాలు జరుపుకోవచ్చును. <u>చివరగా యజ్ఞకర్త ఈ క్రింది మంత్రంతో విద్వాంసుల, బంధుమిత్రుల ఆశీస్సులను కోరాలి.</u>

## ఆశీస్సులకై యజ్ఞకర్త ప్రార్థన

**ఓం సత్యమాశిషం కృణుతా వయోధై కీరిం చిద్ధ్య వథ స్వేభిరేవైః ।
పశ్చామృధో అపభవస్తు విశ్వాస్తద్ రోదసీ శృణుతం విశ్వమిన్వే ॥**

– అథర్వ (20-91-11), (10-67-11)

ఓ విద్వాంసులారా! పెద్దలారా! దీర్ఘాయువును కోరుచున్న నన్ను ఆశీర్వదించి నా కోరిక సత్యం చేయగోరుచున్నాను. మీ ఉపదేశాలతోను, అనుభవాలతోను నన్ను జ్ఞానవంతుని చేసి ధర్మ మార్గాన నడిపించండి. మీ సత్యాశీస్సులవల్ల నేను కష్టాలను, అడ్డంకులను తొలగించుకుంటూ ధర్మమార్గాన పయనింతునుగాక! భూ అంతరిక్షాలు, అందలి ప్రాణులు నాకు సహకరించునుగాక!

## విద్వాంసుల, పెద్దల ఆశీస్సులు

అనంతరం యజ్ఞకర్త విజ్ఞప్తిని మన్నించుచు విద్వాంసులు, పెద్దలు ఈ క్రింది మంత్రాలతో తమ ఆశీస్సులను తెలుపాలి.

**1. ఓం అస్మైమృత్యో అధి బ్రూహీమం దయస్వోదితో యమేతు ।
అరిష్టః సర్వాంగః సుశ్రుజ్జరసా శతహాయన ఆత్మనా భుజమశ్నుతామ్ ॥**

– అథర్వవేదం (8-2-8)

ఓ మృత్యువా! జీర్ణ శీర్ణమై ముసలిదైన శరీరాన్నుండి విడిపించి మరియొక తల్లిగర్భంలోనికి పంపు వ్యవస్థాపక పరమేశ్వరా! ఈ యజ్ఞకర్తకు శాంతి స్వాంతన వచనాలతో ధైర్యాన్ని, కష్టసహిష్ణుతను ప్రసాదింపుము, ఇతనిపై దయ చూపుము. ఈ అనారోగ్యాన్నుండి ఉద్ధరింపుము. పురుషార్థంతోను, పథ్యపానాదులతోను ఆరోగ్యాన్ని కాపాడుకుంటూ ఈ ముసలితనంతోనూ నూరేండ్లు పూర్ణాయువును గడుపగల సామర్థ్యమును ప్రసాదింపుము.

**2. ఓం ఆయుష్యమస్మా అగ్నిః సూర్యో వర్చ ఆ ధాద్ బృహస్పతిః ।**

ఓ బృహస్పతీ! అన్నింటికి పాలకుడవైన పరమేశ్వరా । ఈ యజ్ఞకర్తకు దీర్ఘాయువును, అగ్ని సూర్యులవంటి వర్చస్సును ప్రసాదించుము ॥

– అథర్వవేదం (2-29-1)

**3. ఓం అస్మిన్ ఇంద్రో ని దదాతు నృమ్ణమిమం దేవాసో అభిసంవిశధ్వమ్ ।**
**దీర్ఘాయుత్వాయం శతశారదాయ ఆయుష్మాన్ జరదష్టిర్యథాసత్ ॥**

పరమైశ్వర్యవంతుడైన పరమాత్మ ఇతనికి బలారోగ్యసుఖాలను ప్రసాదించునుగాక! ఓ ప్రాకృతిక శక్తులారా! మీరు ఇతనిలో ప్రవేశించి అనారోగ్యాన్ని దూరం చెయ్యండి. దానితో ఈ యజ్ఞకర్త శతశరత్తుల (నూరేండ్ల) ఆయువును పొందునుగాక!

**4. ఓం ఇంద్రా వరుణా సౌమనసమద్రుప్తం రాయస్పోషం యజమానేషు ధత్తమ్।**
**ప్రజాం పుష్టిం భూతిమస్మాసు ధత్తం దీర్ఘాయుత్వాయ ప్రతిరతం న ఆయుః॥**

– ఋగ్వేదం (8-59-7)

హే సర్వశక్తిమయ పరమేశ్వరా! ఈ యజ్ఞకర్తకు గర్వరహిత సుహృద్భావనను, పుష్టినిచ్చు ధనాన్ని ప్రసాదింపుము. వాటితో ఉత్తమ సంతానాన్ని, పుష్టిని, వైభవాన్ని పొందుచు దీర్ఘాయువును అనుభవించునట్లు అనుగ్రహింపుము.

**5. ఓం ప్రజాపతే రావతో బ్రహ్మణా వర్మణాహం కశ్యపస్య జ్యోతిషా వర్చసా చ ।**
**జరదష్టిః కృతవీర్యో విహాయాః సహస్రాయుః సుకృతశ్చరేయమ్ ॥**

– అథర్వవేదం (17-1-27)

ఓ ప్రజాపతీ! ఓ సర్వద్రష్టా! ఈ యజ్ఞకర్త వేదజ్ఞానాన్ని అనుసరిస్తూ తేజస్సును, ప్రతాపాన్ని, ఆర్యమర్యాదను, కీర్తి పరాక్రమాలను పొందును గాక! సదా సత్కార్యాలనే ఆచరిస్తూ సహస్రాయువును పొందునుగాక! నూరేండ్లకన్నను ఎక్కువ ఆయువును పొందునుగాక!

**6. ఓం శతం జీవ శరదో వర్ధమానః, శతం హేమన్తాన్ శతము వసన్తాన్ ।**
**శతం త ఇంద్రో అగ్నిః సవితా బృహస్పతిః, శతాయుషా హవిషా హర్షమేనమ్।**

– (అథర్వ 3-11-4, ఋగ్ 10-161-4)

ఈ మంత్ర సరళార్థం ఈ పుస్తకంలోనే 22వ పుటలో ఉన్నది.

**7. ఓం సమాస్త్వాగ్న ఋతవో వర్ధయన్తు సంవత్సరా ఋషయో యాని సత్యా ।**

**సం దివ్యేన దీదిహి రోచనేన విశ్వా ఆ భాహి ప్రదిశశ్చతస్రః ॥**

- అథర్వ (2-6-1)

ఓ యజ్ఞకర్తా! ఏ విధంగా శుద్ధమైన అగ్ని తన ప్రకాశంతో నలుదిక్కులను ప్రకాశింపచేయనో, అట్లే, వసంతాది ఋతువులు, ప్రభవాది సంవత్సరాలు, మంత్రార్థద్రష్టలైన ఋషులు, నీవు చేసిన సత్కర్మలు ఇవన్నీ నిన్ను ప్రకాశింపచేయును గాక! వర్ధిల్లజేయునుగాక! అభ్యుదయ నిఃశ్రేయసాలను కలిగించునుగాక! నీవు ధర్మాత్ముడవై లోకమును ప్రకాశింపచేస్తూ, నూరేండ్లు జీవుంచుదువు గాక!

పై మంత్రాలు పఠించి విద్వాంసులు, పెద్దలు యజ్ఞకర్త శిరస్సుపై పువ్వులను అక్షింతలను వర్షింపచెయ్యాలి. అనంతరం విచ్చేసిన బంధుమిత్రులంతా ఈ క్రింది 4 మంత్రాలతో పుణ్యాహవాచనమ్ = స్వస్తివాచనమ్ పఠిస్తూ సర్వవ్యాపక సర్వేశ్వరుని ప్రార్థించాలి.

<u>పుణ్యాహవాచనమ్ = స్వస్తివాచనమ్</u>

**1. ఓం తచ్చక్షుర్దేవహితం పురుస్తాచ్ఛుక్రముచ్చరత్ ।**
**పశ్యేమ శరదః శతమ్, జీవేమ శరదః శతమ్**
**శ్రుణుయామ శరదః శతం, ప్రబ్రవామ శరదః శతం**
**అదీనాః స్యామ శరదః శతం, భూయశ్చ శరదః శతాత్ ॥**

- యుజుర్వేదం (36-24)

ఈ మంత్ర సరళార్థం ఈ పుస్తకంలోనే 13వ పుటలో ఉంది.

**2. ఓం సుత్రామాణం పృథివీం ద్యామనేహసమ్ సుశర్మాణమదితిం సుప్రణీతిమ్ ।**
**దైవీం నావం స్వరిత్రామనాగస మస్రవంతీమారుహేమా స్వస్తయే ॥**

- ఋగ్వేదం (10-63-10)

<u>సరళార్థం</u> : హే ప్రభో! పరమేశ్వరా! నీవు మాకు ప్రసాదించిన ఈ ఉత్తమ మానవదేహము చాలా దివ్యమైనది. భవసాగరాన్ని తరించటానికి ఉత్తమోత్తమ నౌక.

దీనిలో అన్ని రక్షణ ఏర్పాట్లు ఉన్నవి. ఇది విశాలమైనది. ఎంత ఎత్తుకైనా ఎగుర గలిగినది. దీనిలో ఏ లోపములేదు. అనేక రకాల సుఖాలనిచ్చునది. గట్టి సాధనం. సుందరంగా నిర్మించబడినది. దీనిని మేము సద్వినియోగం చేసుకొని త్రివిధ దుఃఖాలతో కూడిన ఈ భవసాగరాన్ని-జనన మరణ రూప సంసార సాగరాన్ని దాటుదుముగాక! మోక్షమును-సమస్త దుఃఖాలనుండి విముక్తిని పొంది నీ తృతీయ ధామానికి చేరుదుముగాక! నీలోని పరమానందము నను భవింతుము గాక!

వివరణ : ఈ మంత్రానికి ఆధ్యాత్మికంగాను, ఆధిభౌతికంగాను, ఆధిదైవికంగాను కూడా అర్థాలు తెలుపవచ్చు. 1. ఆధ్యాత్మికంగా ఈ మంత్రంలోని నౌక మన శరీరమే. మేము పైన అదే అర్థమును వ్రాసినాము. 2. ఆధిభౌతికంగా-చక్కటి బ్రహ్మ విద్యోపదేశం చెయ్యగల గురువు అని చెప్పవచ్చు. ఆయన ఉపదేశాలు మనకు ఒక నౌకవలె సహకరిస్తాయి. 3. ఆధిదైవికంగా-అన్ని రకాల సాధనాలు గల ధృఢమైన సముద్రనౌక అని గాని, గాలిలో ఎగురు విమానం అని గాని అర్థం చెప్పవచ్చు. మరొక రకంగా యజ్ఞపరమైన అర్థం కూడా కొన్ని మంత్రాలకు చెప్పవచ్చు. అంటే యజ్ఞమయ జీవితాన్ని గడుపువారు-అగ్నిహోత్రం వలె పక్షపాతం లేకుండా లోక కళ్యాణం చేసేవారు భవసాగరాన్ని తరించగలుగుతారు. వేదమే స్వయంగా ఈ మాటలు చెబుతుంది-

**"న యే+శేకుర్+యజ్ఞియాం నావమ్ +**
**ఆరుహమ్ + ఈర్మ ఏవ తే న్యవిశంత కేపయః ॥**

- ఋగ్వేదం (10-44-6)

"ఈ యజ్ఞరూప నౌకను ఎక్కలేని వారు ఈ సంసారమనే ఊబిలో అంతకంతకు క్రిందకు దిగబడిపోతారు" అంటుంది. భగవద్గీత కూడా ఇట్లే చెబుతుంది.

**3. ఓం భద్రం కర్ణేభిః శృణుయామ దేవా, భద్రం పశ్యేమాక్షభిర్యజత్రాః ।**
**స్థిరైరంగైస్తుష్టువాగ్ం సస్తనూభిర్వ్య శేమహి దేవహితం యదాయుః ॥**

- యజు. (25-21)

దీని సరళార్థం కూడా 12 వ పుటలో ఉంది.

**4. ఓం దేవానాం భద్రా సుమతిర్ఋజూయతామ్, దేవానాం రాతిరభి నో నివర్తతామ్**
**దేవానాం సఖ్యముపసేదిమా వయమ్, దేవా న ఆయుః ప్రతిరంతు జీవసే ॥**

- యజు. (25-15)

దీని సరళార్థం కూడా 12 వ పుటలో ఉంది.

## ముగింపు

అనంతరం విద్వాంసులు సందర్భోచితంగా ప్రవచించవచ్చు. సత్సంగం తదుపరి వైదిక శాంతిపాఠంతో కార్యక్రమాన్ని ముగించాలి.

## వైదిక శాంతిపాఠం

**ఓం ద్యౌః శాంతి రంతరిక్షగ్ం శాంతిః, పృథివీ శాంతి**
**రాపః శాంతిః, ఓషధయః శాంతిః, వనృతయః శాంతిః ।**
**విశ్వేదేవాః శాంతిః, బ్రహ్మశాంతిః, సర్వగ్ం శాంతిః**
**శాంతి రేవ శాంతిః, సా మా శాంతి రేధి ॥**

- యజుర్వేదం (36-17)

ద్యులోకం శాంతిగా ఉంది. పృథివి శాంతిగా ఉంది. ఆపః (జలం) శాంతిగా ఉంది. ఓషధులు (కాయ పప్పు ధాన్యాలు, మూలికలు) శాంతిగా ఉన్నాయి. వనస్పతులు (మామిడి, రావి, కొబ్బరి మొదలగు చాలా పర్యాయాలు కాయల నిచ్చేవి) శాంతిగా ఉన్నాయి, విశ్వదేవతలు (విద్యావిజ్ఞానాలతో లోకోపకారం చేసే విద్వాంసులు) శాంతి కొరకే ప్రయత్నించుచున్నారు. బ్రహ్మ (సృష్టికర్త)చే ఇవ్వబడినవేదాలు, వాటికి అనుకూలంగా వ్రాసిన గ్రంథాలు అన్నీ శాంతి సందేశాన్నే ఇస్తున్నాయి. సృష్టికర్తచే రచింపబడిన ప్రాపంచిక పదార్థాలన్నీ శాంతి కారకములే. ఏదో ప్రయోజనం కొరకు రచింపబడినవే. అంతటా, అన్నిటా శాంతియే ఉంది. ఓ పరమేశ్వరా! ఆ పదార్థాలలో ఉన్న శాంతిని నాలో ప్రవేశింపజేసి వర్థిల్లజేయుము.

**ఓం శాంతిః శాంతిః శాంతిః.**

# యజ్ఞాంత ప్రార్థన

పూజనీయ ప్రభో! హమారే - భావ్ ఉజ్జ్వల కీజియే ।
ఛోడ్‌దేవేం ఛల కపట్‌కో - మానసిక్ బల దీజియే ॥

వేద్‌కీ బోలేం ఋచాయేం - సత్యకో ధారణ్ కరేం ।
హర్ష మేం హోం మగ్న - సారే శోక్ సాగర్ సే తరేం ॥

అశ్వమేధాదిక్ రచాయేం - యజ్ఞ్ పర ఉప్‌కార్ కో ।
ధర్మ మర్యాదా చలాకర్ - లాభ్ దేం సంసార్ కో ॥

నిత్య శ్రద్ధాభక్తి సే యజ్ఞాది - హమ్ కరతే రహేం ।
రోగ్ పీడిత విశ్వ్ కే సంతాప - సబ్ హరతే రహేం ॥

భావనాయే మిట్ జాయే మన్ సే - పాప అత్యాచార కీ ।
కామనాయేం పూర్ణ్ హోవేం - యజ్ఞ సే నర నారీ కీ ॥

లాభ్‌కారీ హో హవన్ హర్ - ప్రాణ్‌ధారీ కే లియే ।
వాయు జల సర్వత్ర హో - శుభ్ గంధ కో ధారణ్ కియే ॥

స్వార్థ భావ్ మిటే హమారా - ప్రేమపథ్ విస్తార హో ।
'ఇద న్న మమ కా' సార్థక - ప్రత్యేక మేం వ్యవహార హో ॥

హాథ్ జోడ్ ఝుకాయె మస్తక్ వందనా హమ్ కర్ రహేం ।
నాథ్ కరుణా రూప కరుణా ఆప్‌కీ సబ్ పర్ రహేం ॥

# ఎన్నిలోకాలు గాలించినా

(హే మాలిక్ తేరే బందేహం)

ఎన్ని లోకాలు గాలించినా - ఎన్ని అర్థాలు సాధించినా
కన్న తల్లిదండ్రికి-మిన్న ఏముందిరా !
తమ్ముడూ! ఈ తత్త్వము నిజమురా ! ॥ ఎన్ని ॥

అమ్మ మనసెంతొ కమ్మనిదిరా ,
నాన్న మనసెంతొ తీయనిదిరా !
అమ్మ కోపించినా - నాన్న దండించినా ,
అది నీ మంచి కొఱకేనురా ! ॥ ఎన్ని ॥

తొమ్మిదీ మాసములు మోసెరా ,
అమ్మ పదములకు ప్రణమిల్లరా !
పెంచి పెద్దవాణ్ణిగా - మంచి గుణశాలిగా ,
మార్చెనూ నిన్ను మీ నాన్నరా ! ॥ ఎన్ని ॥

వారి రక్తం పంచుకు పుడితివి ,
వారి కెంతెంతో ఋణపడితివి !
వారు నీ ప్రాణము-వారు నీ ధ్యానము ,
వారు లేకుంటె నువు లేవురా ! ॥ ఎన్ని ॥

కన్నవారిని కావడి మోసెనా ,
మాన్య శ్రవణాఖ్యుడే ధన్యుడు ।
నాటి శ్రీ రాముడు - నాటి ఆ భీష్ముడు ,
నేటి కైనను చిరంజీవులు ! ॥ ఎన్ని ॥

ప్రాణముతొ వారు ఉన్నప్పుడే ,
పరిచర్యలు చేసి తరియించరా !
చనిపోయిన పిమ్మట వారి నామమ్ముతో ,
శ్రాద్ధములు బెట్టి ఫలమేమిరా ! ॥ ఎన్ని ॥

# గాయత్రీ ఆశ్రమ ట్రస్టు ప్రచురణలు

వేదాలలో సూర్యకిరణ చికిత్స (40-00), వేదాలలో జలచికిత్స (20-00), వైదిక క్రాంతి పథం (15-00), అగ్నిహోత్ర వైజ్ఞానిక స్వరూపము (15-00), దౌహృదిని (ఋషుల దృష్టిలో గర్భిణిస్త్రీ) (20-00), అగ్నిహోత్ర రాసాయనిక విశ్లేషణ (20-00), గర్భధాన విజ్ఞానము (30-00), మానవ ధర్మము (20-00), అశ్వినీ దేవతలు (20-00), సంధ్యా వందనము - వైజ్ఞానిక సమాలోచనము (20-00), అగ్నిహోత్ర ఆధ్యాత్మిక స్వరూపము (30-00), గంగాధర శివుడు (5-00), గోమాత (30-00), గాయత్రీ విజ్ఞానం (50-00), జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ (60-00), స్వాతంత్ర్య సముపార్జనలో మహర్షి దయానందుడు (10-00), దైనిక అగ్నిహోత్రవిధి (4-00), మన ఇతిహాసం (70-00), మన వేదశాస్త్రాల పరిచయం (50-00), చతుర్దశ భువనములు (10-00), ఐతరేయోపనిషత్తులోని సృష్టికథ (10-00), యుగపురుషుడు శ్రీ కృష్ణుడు (8-00), వైదిక వివాహ వైశిష్ట్యము (8-00), ధర్మవీర్ పం. లేఖరామ్ (3-00), వేదాలలో అప్సరస గంధర్వులు (2-50), యజ్ఞోపవీత వైశిష్ట్యము (2-00), లక్ష్మీ సూక్తము (2-00), శాంతి ప్రార్థన (2-00), దగ్రేట్ గాయత్రి (2-00), వైదిక అర్థనీతి (2-00), బ్రహ్మచర్య విజ్ఞానము (15-00), శ్రీ దయానంద హృదయము (12-00), స్వరాజ్య సంగ్రామంలో ఆర్యసమాజము (8-00), సత్యధర్మవిచారణ (6-00), వైదిక సంస్కృతిలో వానప్రస్థాశ్రమం (10-00), మరణానంతరం జీవుని ప్రయాణము (40-00), ప్రణవ స్తోత్రం (10-00), అహల్య రాయిగా మారలేదు (2-00), దయానందుని ఆదర్శరాజ్యం (1-00), మాతాపుత్రికల జ్ఞానచర్చ (60-00), వేదాల వెలుగు చూపే ఆర్యసమాజము (20-00), వైదిక సరస్వతీ సూక్తము (10-00), అగ్నిహోత్రం 100% వైజ్ఞానికం (60/-). పెండ్లినాటి ప్రమాణాలు (40/-), వేదాలలో వర్షేష్టి విజ్ఞానం (25/-), దేవుడు-జీవుడు-ప్రకృతి (30/-), వైదిక జన్మదిన వేడుక (30/-) వేదోపదేశాలు (ముద్రణలో).



# ప్రార్థన

ఓం ఇన్ద్ర మృళ మహ్యం జీవాతుమిచ్ఛ
చోదయ ధియమయసో న ధారామ్।
యత్కించాహం త్వాయురిదం వదామి
తజ్జుషస్వ కృధి మా దేవవంతమ్ ॥

- ఋగ్వేదం (6-47-10)

ఓ ఇన్ద్ర! పరమైశ్వర్య ప్రదాతా! దయతో నాకు ధర్మసాధనచేయ జీవితేచ్ఛను ప్రసాదింపుము. జ్ఞానసాధనమైన నా బుద్ధిని ఖడ్గధారవలె పదునుపెట్టి నీ వేదజ్ఞానాన్ని గ్రహించ సమర్థుని చేయుము. నిన్ను చేరగోరు నాకు అవసరమగు యమ నియమాది అష్టాంగముల సిద్ధిని ప్రాప్తింప చేయుము. నన్ను దివ్యగుణయుక్తుని చేసి నీ దరి చేర్చుకొమ్ము.

O Indra! Paramishwarya Pradata! Bestow happiness on me. Desire for my long life, inspire me to have good intellect, good actions and good speech - attractive like gold. Accept my prayers in whatever words I speak, provide me the company of enlightened persons.

Gayathri Series - 63

# VAIDHIKA JANMADINA VEDUKA

Price : 30/-





"హోతృషదనం హరితం హిరణ్యయం" (అ. 7-99-1)
హోమం జరుగు ఇల్లు పాడి పంటలతో, బంగారంతో నిండుతుంది.

"ఈజానాః స్వర్గం యన్తి లోకమ్" (అ. 18-4-2)
యజ్ఞం చేయువారు స్వర్గలోకాన్ని-గొప్ప గొప్ప సుఖాలను పొందుదురు.

---

Published by :
**GAYATRI ASHRAM TRUST**
12-10-586/6, Arya Samaj-Vyasnagar, Medibavi.